## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

బాలానంద

# పల్నాటి వీర చరిత్ర

రచన:
నాగశ్రీ

నవరత్న బుక్ సెంటర్
ఏలూరు రోడ్, విజయవాడ-520002

# వి ష య సూ చి క

సానితో సరసాలాడిన బాలచంద్రుడు
అత్తవారింటికి వచ్చిన అందాల బాలుడు
మాంచాల దీవెనలు పొందిన మంత్రి కుమారుడు
ముత్యాలహారము-ముద్దుటుంగరములు
మలిదేవుని దర్శించిన బాలచంద్రుడు
యువక సోదరుల యుద్ధోన్మాదం
బాలచంద్రుడాడిన పోటు మాటలు
అనపోతు పంపించిన ఆనవాలు
తినబోవు ముద్దలు తీర్థముపాలు
సంధికుదరని సంగ్రామము
రణభూమి కరుదెంచిన నరసింగరాజు
నరసింగరాజు బాలచంద్రుల మరణము

# పల్నాటి వీర చరిత్ర

## అలనాటి పలనాటి సీమ

అలనాటి పలనాడు—

అందాల పలనాడు - చందాల పలనాడు - అపరంజి పంటల పలనాడు - అమరవీరుల పలనాడు—మన పలనాడు.

కొనరాని వెలలేని కోహినూర్ వజ్రం పుట్టిన పురిటిగడ్డని చరిత్రకారులచే చాటి చెప్పబడిన పలనాడు, ప్రఖ్యాత వజ్రాల పంటభూమిగా గణకెక్కింది. ఢిల్లీ చక్రవర్తి బాబరు కుడిచేయిలో కళకళలాడి, షాజహాను చక్రవర్తికి ప్రాణసమానంగా పరిగణింపబడి పారశీకవాదరుషాను, పరవశమొందించి- ఆఫ్గన్ స్థానాధీశ్వరుని అభిమానాన్ని చూరగొని - హైందవ రాజులకొలువు కూటాలలో అభినందల నందు కుని తరువాత ద్వీపాంతరమున కేగి రవి యస్తమించని సామ్రాజ్యపాలకులయిన పంచమ చక్రవర్తి మకుటము నలంకరించి వెలుగొందినది. మన నేల బుట్టిన కోహినూర్ వజ్రమే నన్న ఘనత మనకు దక్కింది.

పలనాటిసీమలోని తమ్మకోటచెంత మల్లవరంచెంత కూడ వజ్రపు గను లున్నవి. మొగలాయిరాజుల పాలనాకాలంలోనూ యీ గనులలో విశేషంగా

పనులు జరిగినట్టు "మెమోరెన్ ఆఫ్ ది జియాలజికల్ సర్వే ఆఫ్ ఇండియా" అను పుస్తకం నేటికిని చాటి చెబుతూంది.

పలనాటిసీమలో లోహాలుకూడ వున్నవి. కారెమపూడి యొద్ద సీసం విస్తారంగా లభించింది. అలాగే వినుకొండయందు పల్నాటి తాలూకాయందును రాగి మరియు ఇనుము దొరికినట్లు చరిత్ర తెలుపుతూంది. గుత్తికొండ గ్రామాన పూర్వమొకప్పుడు లోహములకరిగిన కొలుముల బాపతు గుర్తు లీనాటికిని కన్పడుచున్నవి. అచటి తిప్పలతో నొకదానికి ఇనుపకొండ యను పేరు వచ్చినది. అంతేగాక, నాడీ ప్రాంతమందలి భూగర్భ పరిశోధనలు చేసి వానిని తీయించినవారు నివసించిన పల్లె యీనాడు "కొలుములపాలె"మను పేరున పిలువబడు చున్నది కూడాను.

పలనాటిసీమకు రాజధాని గురిజాల. పూర్వమొకప్పుడిచట గురువింద పొదలు మిక్కుటంగా నున్నందున్న దీనిని గురిజాల అన్నారట. గురిజాల కృష్ణానదీ తీరమునకు రమారమి నూటయిరుపది మైళ్ళ ధూరమున నున్న నగరం. ఉత్తర పడమరలుగా కృష్ణానదీ ప్రవాహమిచట డెబ్బయిదుమైళ్ళు పారుతూంది. దక్షిణమున కొండలు సాంద్రారణ్యమును, తూర్పున చిట్టడవులు నాగులేరు, చంద్రవంక నదులు కలిగినందున నీ ప్రదేశం పల్లమునందుండుటచే పల్లవునాడు, పలనాడని నాడు చెప్పబడి నేడు పలనాడు, పల్నాడు నామముల దాల్చి చరిత్రలో వీరపల్నాడుగా వినుతికెక్కింది. ఇచటి చంద్రవంకనే చంద్రభాగమనియు చెప్పబడుచున్నది. కాని చంద్రభాగమని ప్రసిద్ధిగాంచిన నదిమాత్ర మిదికాదు. నాగులేరునకు నాగానదియని యింకొక పేరున్నది.

పూర్వమిచ్చట నాగజాతివారు నివసించినందున యీ ప్రవాహానికి నాగు లేరను పేరువచ్చినట్లు జనవదంతి విన్పట్టుచున్నది. పల్నాటిసీమ దండకారణ్యంలో ఒక త్రేతాయుగంలో రావణబ్రహ్మ బంధువులు, పరివారంలోని వారైన ఖరదూష ణాదులచే పాలింపబడినదని పురాణ ప్రసిద్ధియు కలదు. రామాయణ కాలములో మారీచుడు పాలించినచోట వెలిసింది. మాచెర్లయని- ఖరుడు పాలించినచోట వెలి సింది. కారెమపూడియని- దూషణుడు పాలించినచోట వెలిసిందీ దుర్గయనిగూడా యిచటి జనవాడుకలు వినబడుచున్నవి. నేటి ఈ పలనాటిసీమ వెలిసినచోటునందే నాడు విశ్వామిత్ర మహాముని సత్రయాగం చేసినట్లును చెప్పబడుతూంది.

ఈ పలనాటిసీమప క్రీస్తుశకం పన్నెండవ శతాబ్దంలో చందవోలు నేలు ప్రభువు తన కల్లుడైన అనుగురాజుకు అరెణముగ నీయబడింది.

## అదృష్టవంతుడు అనంగురాజు

అది ఉత్తరభారతదేశమందలి బాలపాంచాలపురం, దానినే జంభనాపురి అనికూడా అంటారు. ఆ రాజ్యానికి వారసుడు అనుగురాజు. కార్తవీర్యార్జునుని సంతతివాడయినందున హైహయవంశీయుడని తెలుస్తూంది. ఆయన తండ్రి వీర కామేంద్రుడు కార్తవీర్యునిగా అవతరించాడని అంటారు.

అదృష్టదేవత యెప్పుడూ ఒకచోటనే యుండదు. అనుగురాజు దశ తారు మారయింది. ఉన్నచోటు నొదిలేసి పోవలసి వచ్చింది. అవస్థలందున్న వారికి అను

మానాలు పెచ్చు జ్యోతిషశాస్త్రిల నడిగాడు. ఆ బ్రాహ్మణులాయనకు నీపూర్వీకు డైన కార్తవీర్యార్జునుడు చేసిన పాపాలు నిన్ను పట్టి పీడస్తున్నవి. నీవు జీడినూనె బట్టలు ధరించి సకుటుంబముగ తీర్థయాత్రలు చేస్తుండగా నీ మేనిగుడ్డలు తెల్లబడి నపుడు నిన్నీ పాపా లొదిలిపోతా" యని చెప్పాడు.

అవమానాలకు అనుమానాలకు గురియైన అనుగురాజుకాలోచనలేక "కార్త వీర్యార్జునుడు చేసిన పాపాలు మా వంశంలో యెవరి జోలికిపోకుండ నన్నొకనినే యెందుకు పట్టుకున్నవి!" అని అడుగలేకపోయాడు. మంచి రోజు చూచుకుని తీర్థయాత్రలకు బయలుదేరాడు. ఆయనలాగా వచ్చి దక్షిణ భారతదేశంలో అమరావతి యొద్ద కృష్ణలో మునిగినంత వాని జీడినూనె బట్టలు తెల్లబడినయి. అంతటితో వానికి చందవోలు పరిచయం కలిగింది. చందవోలు నేలు ప్రభువు తన కుమార్తె మైలమదేవిని అనుగురాజునకిచ్చి వివాహంచేసి పలనాటిసీమ పణముగా యిచ్చాడు.

నాడు తొలగిపోయిన అదృష్టము నేడు కలసివచ్చిన అనుగురాజునకిపుడు తాతముత్తాతల నాటి పాపాలు తప్పిపోయినయి. గొప్పవారి చుట్టరికం కూడ వచ్చింది. పాలించుకొన పలనాటిసీమతో బాటు మైలమదేవి పట్టపు రాణిగా లభిం చింది-ఆయనకిపుడు గురజాల రాజధాని. దొడ్డనాయుడు మంత్రి అయ్యాడు.

చేతినాయకుడు వెంకటగిరి సంస్థానాధీశ్వరులైన వెలుగోటివారి వంశానికి చెందిన పద్మనాయక వెలమ వంశీయుడు. రేచర్లవారు చేతి నాయకుని కుమారుడు దొడ్డనాయుడు, దొడ్డనాయునకు బాదరాజు, బ్రహ్మనాయుడు, సూరినీడు, పేరినీడు, మల్లినీడను వారైదుగురు కుమారులు. వారిలో బాదరాజును పెద్దన్నయని-బ్రహ్మ నాయుని బ్రహ్మన్నయని కూడా అంటారు.

అనుగురాజుకు పట్టపురాణియైన మైలమదేవి తరువాత భూరమాదేవి వీర విద్యాదేవి యనే భార్యలిద్దరున్నారు. ఆయనకా ముప్వురు దేవేరులవలన కూడా తొందరగా సంతానం కలుగనందున మంత్రి దొడ్డనాయుని కుమారులలో పెద్ద వాడైన బాదరాజును దగ్గరకు తీసికొని కన్నకుమారునివలె పెంచాడు. అది చూచిన జనమంతా "బాదరాజు అనుగురాజుకు పెంపుడు కొడుకు" అనుకున్నారు.

కొంతకాలం గడిచింది— రాణుల కడుపులు పండినాయి.

మైలదేవికి నలగామరాజు, భూరమాదేవికి కామిరాజు, నరసింగరాజు, ఝట్టిరాజు, పెరుమాళ్ళరాజులను నలువురు కుమారులు- వీరవిద్యాదేవికి పెదమలి దేవ, పినమలిదేవ, బాలమలిదేవులను ముప్వురు కుమారులు కలిగారు. ఆ కారణాన అనుగురాజుకు స్త్రీ సంతానం లేకపోయినా పురుష సంతానానికి లోటు లేకపోయింది వారంతా బాదరాజును పెద్దన్నయ్యని పిలుచుచుండెడివారు. బాదరాయని కిపుడు కంచర్లపురము నేలు కృష్ణగంధర్వుడను క్షత్రియని కుమార్తె లవాంబతో వివాహంచేసి ఒక చిన్న నగరపాలకునిగా నియమించాడు అనుగురాజు.

దొడ్డనాయుడు పెద్దవాడయినందున బ్రహ్మనాయునికి మంత్రి పదవి లభించినది.

# క్రొత్త మంత్రిగారి కుటిల బుద్ధి

అనుగురాజుకు పెంపుడు కుమారుడై పలనాటిసీమకు ప్రభువు కాగలడనుకున్న పెద్దన్నకా పెద్దరికం దక్కలేదన్న కొరతచేతనో యేమోగాని క్రొత్తగా మంత్రి పదవికి వచ్చిన బ్రహ్మనాయుని కారాజుమీద...రాజ కుటుంబం మీద నిజమైన ప్రేమాభిమానాలు లేకపోయినను, బ్రహ్మనాయుడు గుండెధైర్యం కలవాడు మంచి

మేధావి. మనసులోని యాలోచన మరియొకరికెంత మాత్రమూ పసిగట్టనీయడు. రాజకీయ చతురత యందాతనికున్న పాండిత్యం సాటిలేనిది. కడుపులో కాలకూట విషమున్నా పెదవిమీది తేనె పలుకులతో ప్రజలలో పరువు ప్రతిష్టలు సంపాదించుకున్నాడు. పల్నాటి శ్రీకృష్ణుడన్న పేరాయనకు ప్రత్యేక గౌరవ స్థానం. ఆయనగారి అడుగుజాడల దాటని అభిమాన వర్గం...ఆ వెనుక రహస్యభట వర్గం గూడ యేర్పడింది.

ఒకప్పుడు అనుగురాజు వేటకు బయలుదేరాడు. ఆయన పరివారంలోనే బ్రహ్మన్న—బ్రహ్మన్న మంత్రి ఆంతరంగిక మిత్రులుకూడా వున్నారు. చాలా సేపు వేటాడిన రాజు అలసిడస్సిపోయిన సమయం. బ్రహ్మన్నగారు ముందుగా నియమింపబడిన అనుయాయి లందొక్కడు యేదియో జంతువును చంపబోయినట్లుగా అనుగురాజుమీద బాణం నాటాడు. అనుగురాజుకి కెవరిమీద యెటువంటి యను మానాలు లేనందున జరిగింది, నిజంగా ప్రమాదమేనని నమ్మాడు. బ్రహ్మనాయుని చేరబిలిచి "నాకు కాలం తీరిపోయింది. ఇకమీద నా కుమారులు తండ్రిలేని బిడ్డలగుచున్నారు. వారిని నీవే పెంచి, పెద్దవారిని చేసి, వారికి న్యాయం కలిగించ"మని చెప్పి ప్రాణాలు విడిచాడు.

మంత్రిగారి ఆలోచన మంత్రంలా పనిచేసింది.

బ్రహ్మన్న యిపుడు రాజ్యానికి సర్వాధికారి అయ్యాడు. ఆయన ప్రజలకే గాకుండ రాజ కుటుంబానికిగూడ దేవుడయ్యాడు. రాజ్యాంగ ధర్మం ననుసరించి తండ్రి పెద్దకొడుకైన నలగామరాజుకు పట్టం కట్టి ప్రభువుని చేశాడు.

మంత్రిగారిపుడు మహాధర్మంగల సంఘ సంస్కర్తలయ్యారు. పంచములైన మాల, మాదిగ వారల నానాడు పెద్ద కులాలవారు తాకనిచ్చేడివారుకారు. పంచ

ములు దేవాలయాలలోనికి రారాదనే నిబంధనలుండేవి. నిజానికది మంచిపనిగాదు. బ్రహ్మనాయుడా కాలంలో సనాతన మతాన్నెదిరించి పంచములకు దేవాలయ ప్రవేశాధికారం కలిగించాడు. అంతవరకైతే చాలా బాగుండేది. దాని చాటున కొన్ని సభ్యతలేని దురాచారాలు విచ్చలవిడిగా జరుగుతున్నాయి, అని నరసింగరాజు మొదలయినవారి గట్టి నమ్మకం. నరసింగరాజు నలగామునికి సోదరుడే గాకుండా పలనాటి రాజ్యానికి సర్వసైన్యాధిపతి కూడాను.

బ్రహ్మనాయుడు తన కభిమాన కుమారుడైన మాల కన్నమదాసును దళాధిపతిని చేశాడు. అది నరసింగరాజుకు గిట్టలేదు. మంత్రిగారినెదిరించడానికి సిద్ధమయ్యాడు. కాని వాని రాజకీయ చతురత ముందు తప్పు తప్పుగా నిరూపించి చూపగల శక్తియుక్తులు లేక వెనుకాడుతున్నాడు.

పంచమ దేవాలయ ప్రవేశం చాటున మంత్రిగారు చూపమూటు సిద్ధాంతాన్ని ఆచరణలో పెట్టాడు. అన్నంవండి చాపమీద రాశిపోస్తారు. దానిప్రక్క పాకాలు గూడ యుంటాయి. ఏ కులమైనాసరే, ఎవరయినాసరే నిరాటంకంగాపోయి రాశిలోని అన్నం చాపమీద కలుపుకుని తిన్నంతతిని పోవాలి. తరువాత వచ్చినవారా మొదటివాడు తినిపోయిన మెతుకులలోనే మరికొంత కలుపుకుని తిని పోతుంటారు ఒకప్పుడు కొందఱుగా కూడా యీ చాపమీద తింటుంటారు. దీనివలన కుల మత భేదాలను కూలద్రోస్తున్నామని వారు చెప్పే మహోపన్యాసం.

నిజానికి సర్వమానవ సహపంక్తి భోజనాలంటే ఇవికావు. ఇందువలన సాధింపగల్గ మహోదయమంటూ లేదు. ఇదొక యెంగిలి మంగలమేనని నరసింగరాజు కోవకు చెందిన గుణవంతుల వాదం. అమాత్యుల వారి యరాచక మంతటితో ఆగినదియు లేదు.

# నాయకురాలు నాగమ్మ కథ

నాగులేటి యొడ్డున జిట్టగామాలపాడు. రామిరెడ్డి చౌదరి వీదకుటుంబానికి చెందిన పంటకాపురెడ్డికి సంతానంలేదు. ఒకనాడాయన భూమి దున్నేటందుకు పొలం పోతూండగ బాట ప్రక్కన పూపొదలో బాలరోదనం వినపడింది. ఆయ నటు పోయి చూచాడు. చూడ చక్కదనాల పాపాయి కంటపడింది. ఎత్తి ముద్దా డాడు. ఆమెకు సంబంధించిన వారెవరూలేరని నిర్ణయించుకున్నాక దొరికిన బిడ్డను ఇంటికి తెచ్చి ఇల్లాలిచేతి కిచ్చాడు. ఆమె మురిసిపోయి ముద్దులాడింది.

రామిరెడ్డి చౌదరి తిరిగిపోయి పొలంలో అరక గట్టాడు. వాని వెనుకనెవరో యుండి "నేనుకూడా నీ ఇంటికి వస్తాను. నన్నుగూడ తీసికొనిపో" అన్నట్లు మాటలు వినబడినాయి. ఆయన దిక్కులన్ని తిరిగిచూచినా యెవరూ కనపడలేదు. మళ్లి యెద్దుల నదిలించాడు. భూమిని దున్ను నాగలి మొనకేదో ఖంగుమని తగిలింది. దానిని పరిలిశించి చూచిన రెడ్డిరైతు నిక్షేపం కనులచూశాడు... చాళ్ళు దున్నేపని చాలించి ఇంటికివచ్చి భార్యతో చెప్పాడు.

ఆ రాత్రికి రైతు దంపతు లొక మేకపోతును తోలుకొని పోయి నిక్షేపం ముందు బలియిచ్చిన తరువాత నమస్కారాలు చేసి చేతికందిన మహాలక్ష్మిని ఇంటికి చేర్చుకున్నారు. బిడ్డవచ్చినవేళ— గొడ్డు వచ్చినవేళ అన్నట్లుగా వారింట సిరిసంపదలు చిందులాడినాయి. అన్నట్టు ఆ పాప వానికా పూపొదలోని నాగేం ద్రుని పుట్టమీద దొరికినందున వారామెకు "నాగమ్మ" అని నామకరణం చేశారు. నాగేంద్రాంశం నాగమ్మకు తప్పకుండా వచ్చింది. మేకపోతు సింగారెడ్డిగారు నాగమ్మకు మేనమామలు.

చదువుకునే యీడురాగ తల్లిదండ్రులామెను గోపన్నమంత్రి దగ్గర విద్యాభ్యాసం చేయించారు. సంస్కృతాంధ్ర భాషలలో పండితురాలయింది. రాజకీయంలో ప్రతిభ సంపాదించింది. అశ్వారోహణ గజారోహణలో ఆరితేరింది. యుద్ధనైపుణ్యంలో నుత్తీర్ణురాలయింది. నాగమ్మకు సాటి నాగమ్మే ననిపించుకుంది.

నాగమ్మకు పదునెనిమిదవయేట అరవిల్లి ఓబులరెడ్డిగారి ఏకైక కుమారుడు సింగారెడ్డిగారితో వివాహం జరిగింది. మహా శ్రీమంతులు. కాని విధి బలీయమగుట ఆమె పెండ్లినాటి పూలజడ వాడకముందు - నొసటి కుంకుమబొట్టు చెదరకముందే - కంటికాటుక కనుమాయకముందే సింగారెడ్డి చనిపోయాడు. నాగమ్మ పతి నంటని సతి. మరికొన్ని దినాల కత్తమామలుగూడ చనిపోయినందున అత్తవారింట పెత్తనం చేజిక్కింది. అటుమీద తల్లిదండ్రుల అనంతరం పుట్టింటివారి మహా ఐశ్వర్యం కూడ వచ్చి కలిసింది. ఆమె యిపుడొక జమీందార్ స్థాయికి జెందిన శ్రీమంతురాలయింది. రాజ కుటుంబముతో పరిచయము గూడ సంపాదించుకుంది.

ఆ రోజులలో బందిపోటు దొంగలముఠా లెక్కువగా గ్రామాలమీద పడి దోచుకుంటున్నారు. గ్రామాలకు రక్షణ కావలసివచ్చింది. నాగమ్మ యువజన సంఘాలు సమకూర్చుకుని వారికి సాముగరిడీలు పూర్తిగా నేర్పింది. అంతేకాకుండా కొంత గజదళం, అశ్వదళం, భటదళాలనుకూడా నేర్పాటు చేసింది. ఆ కారణంగా రెడ్డిగారి నాగమ్మ నాయకురాలు నాగమ్మగా పేరు పొందింది.

ఆమెకు శంకరుడారాధ్యదైవము. ఆమె యిక చేయదగిన పనులేవీ లేవనుకుంది. ధనలోపము జనలోపము లేని సంపన్నురాలైనందున నగరికి సమీపము

నందున్న ఒక అడవిలో ఆశ్రమము నిర్మించుకొని శివపూజలతో కాలము గడుపుతుంది.

# నాగమ్మను నొప్పించిన నరసింగరాజు

నాగమ్మ తన దినచర్యల ననుసరించి ఉదయకాల శివపూజాదులు పూర్తి చేసుకుని ఆశ్రమము ముందు చెట్లనీడన కూర్చుంది. ఆమె మనసునందెందుకో గాని గడిచిపోయిన ఒకనాటి రాజకీయ ఘట్టాలు స్ఫురణకు వచ్చినై. అంతలోనే వాని లోకి పోవాలనుకుని పెదవి విరిచింది. అనుకొనకుండగానే "నాగమ్మా !" అనే పిలుపు వినబడింది.

తలెత్తి చూసింది నాగమ్మ —

"నరసింగరాజుగారా! దయచేసి కూర్చొనండి. మహారాజులు-సేనాధిపతులు మమ్ము చూడ వచ్చిన కారణము వినసిద్ధముగ నున్నాను" అన్నది.

"నీతో కొన్ని రాజ్యాంగ విషయాలు మాటాడాలనే వచ్చాను."

"అభ్యంతర మేముంటుంది ? — చెప్పండి."

"మీరు రాజ్యాంగ రంగములో ప్రవేశించాలని మా కోరిక"

నరసింగరాజుగారూ! ఆ కాలము గడిచిపోయి చిరకాలమయింది. మిగిలిన నా ఈ జీవితాన్ని భగవత్సేవ కంకితం జేయాలని యీ మూలకువచ్చి కూర్చున్నాను. నన్నెందుకు మళ్ళీ ఆ మహాసంగ్రామము లోనికి యీడ్చుకొని పోతారు.

"ఇది నా కోసముకాదు" నీ కోసమంతకంటెకాదు. కాని పలనాటిరాజ్యంలో బ్రహ్మనాయుని నాయకత్వాన అన్యాయాలకు గురియై అలమటించి పోతూన్న మహిళామణుల మాన మర్యాదలను కాపాడడానికిమాత్రమే. పాడైపోతూన్న పసి

కాపురాలను కాపాడి, నీ సాటి స్త్రీ జాతికి న్యాయము కలిగించేటందుకు నీవు గురజాల రాజకొల్వులో మంత్రిణి పదవి నిర్వహించాలని నా కోరికేకాదు - ప్రార్థన కూడాను.''

ఆ మాటకు తిరుగు చెప్పలేక పోయిన నాగమ్మ "అంటే ?" అన్నది.

"అదే చెప్తున్నాను. నాయుడుగారిపుడు నడుపుతూన్న పంచమ దేవాలయ ప్రవేశమైతే మాకు గూడ సంతోషమే- మరొక విధంగా గర్వకారణము కూడాను. ఆ పంచమ దేవాలయ ప్రవేశ మహోత్సవము వెనుక చాపకూటి సిద్ధాంతము. దాని చాటున అంతకంటె భయంకరమైన కామవిలాసం. అది కంచుకోత్సవం. కామతృప్తి పండుగలలాంటి పచ్చిబూతనములో హరపాటుండదు. హద్దుపద్దులులేక, నీతి నియమంబులు లేక పూవులమీద వ్రాలు తేనెటీగలలాగ యధేచ్ఛా లైంగిక వ్యాపారము అదొక సాంప్రదాయంగా స్త్రీ పురుష సంయోగం వినోదమైనపుడింక భార్యాభర్తలు కాపురాలేం చేయగలుగుతారు ? — ఎలా చేస్తారు ?

"నిజమేనంటారా !''

అద్దంలో చూస్తూకూడా అనుమాన మెందుకు ? బ్రహ్మనాయుని కొడుకు బాలచంద్రుడు బంగారంలాంటి తన భార్య మంచాలవంక కన్నెత్తిచూచి యెరుగడు. యీ అన్నగారల్లుడు అలరాజు రత్నాల నేరమ్మ, గుమ్మం త్రొక్కినవాడు కాడు. మహారాజుగారల్లుడు మహామంత్రిగారి కుమారులే యీ స్థితికి దిగజారిపోయినపుడు ఊరుపేరు లేని సామాన్య ప్రజలింకెంవరీ మహాదారుణ సాంప్రదాయంలో కూరిపోయి యుంటారో గమనింపదగిన విషయం. అందువలన బాధపడే ప్రజలింకెవరిలోనీ ప్రళయం తప్పించమని చెప్పకొన గలరో నీవాలోచించాలి.

"నాయుడుగారేమంటున్నారు ?"

ఆయననొక తేనెపూసిన కత్తి. ఈ యనాచారానికి జీవంపోసి పెంచుతున్నదీ మంత్రిగారే. నాయునికి పెమ్మసాని ప్రియురాలు. పెమ్మసాని కొడుకు కన్నముడు. వారీయనకు కరమున బుట్టిన అభిమాన పుత్రుడట. అనగా బ్రహ్మన్న పలనాటి శ్రీకృష్ణుడగు దైవాంశ సంభవుడని, వారి వరప్రభావమున కన్నముడు కలిగెనె, కాని జారుణిసంభవు డెంతమాత్రమును కాడని అమాయకుల మూఢనమ్మకం. బ్రహ్మన్న వాక్ప్రభావంచేతనే పెమ్మసానికి సంతానం కలిగినపుడు ఐతమ్మకు బిడ్డలులేక అంతకాలమన్ని నోములు నోచి అంతమంది దేవతల నారాధించుచుండులకని యడిగిన వాడు లేకపోవుట శోచనీయం. కన్నమదాసేగాక చాకలి నందు, కుమ్మరి పట్టి మొదలైనవారు కూడ నాయునిగారి అక్రమ సంతానమే. ఆయా స్త్రీల భర్తలలో కొందరు మహామంత్రి నెదిరింపలేక తలలువంచక తప్పడం లేదు. మరికొందరు పుక్కిట పురాణములను నమ్మినందున వారి భార్యల కిట్టి భాగవతోత్తములతో సంతానం కలగడం అదొక ఘనకార్యమని గూడ నమ్మినవారు లేకపోలేదు.

దీనికి మీరేం చేయదలచుకున్నారు ?

స్త్రీలకు మాన మర్యాదలు దక్కాలంటు, యువకులు వారివారి భార్యలతో కాపురాలు చేయాలంటె, మీరు మా కొలువున మంత్రిణిగచేరి నాయుడుగారాట కట్టించడమే మొదటిసారిగా జరుగవలయు ననుకొనుచున్నాను. దీనికుపాయం గూడ మీరే యోచించాల- అన్న నరసింగరాజుతో నాగమ్మ సరేనన్నట్లుగ తలాడించి "రెండు మూడు రోజులలో మార్గమాలోచించి మీ దగ్గరకు మనిషిని పంపుతా" నన్నది. నేనిక పోయివస్తానంటూ నరసింగరాజు లేచి వెళ్ళిపోయాడు.

# నిలకడపడతగాన్న నలగామరాజు

చేది దేశంనుండి దక్షిణ భారతావనికి వచ్చి, చందవోలు ప్రభువుతో చుట్టరికం చేసి, పలనాటికి పాలకులైన అనుగురాజు కుమారుడు నలగామరాజు. తండ్రి తరువాత తండ్రి రాజ్యానికి రాజయ్యాడు. ఆయనకింతా సవతితల్లుల కుమారులైన తమ్ముళ్ళేడ్గురున్నారు. ఈ ప్రాంతంలోనే బాంధవ్యం పెంచుకోవాలనుకున్నాడు.

ఆ కాలాన నిజాం రాజ్యమందలి బీదరుకు ముప్పదయిదు మైళ్ళ దూరాననున్న కళ్యాణమును పశ్చిమ చాళుక్య వంశపు రాజులు పాలిస్తున్నారు. క్రీ.శ. పదివందల సంవత్సరాల తరువాత దేశమంతటా చోళరాజుల పాలన విస్తరించింది. వారిలో ముఖ్యంగా రాజమహేంద్రవరం పాలించిన రాజరాజనరేంద్రాదులు తూర్పు చాళుక్యులైతే కళ్యాణము నేలినవారు పశ్చిమ చాళుక్య వంశీయులు. ఈ కళ్యాణం పాలించిన వారిలో ముగ్గురు సోముల తరువాత నాల్గవ సోమభూపాలునకు మురారి సోమదేవర, వీరబిజ్జల, సోమేశ్వరదేవరలను బిరుదములున్నవి. ఆయన కేడ్గురు కుమారులు ఒక కుమార్తె.

నలగాముడు తన సోదరులలో వీరవిద్యాదేవి పెద్దకుమారుడైన పెదమలిదేవునకా వీరసోముని కుమార్తెను వివాహం చేసుకున్నాడు. అంతేకాకుండా తమ్ముని బావమరుదులు లోనివాడైన కొమ్మరాజు రాజమల్లు అను అలరాజునకు తన ఏకైక కుమార్తె రత్నాల పేరమ్మనిచ్చి పెండ్లిచేసి-ఎప్పటికయిన యిల్లరికంపు టల్లుడేగదాయని అల్లుని-బావనుగూడ తన యొద్దనే యుంచుకున్నాడు.

మలిదేవుని బావమరిది కుమారునికి పిల్లనిచ్చినందున తన తమ్ముడు తన కింక దగ్గర కాగలడని నలగాముని యాలోచన. సవతి తల్లుల కొడుకులకే తేడా కనపడకుండ అన్నదమ్ముల అనురాగం పెరుగుతుందనుకున్నాడు నలగామరాజు. కాని అలా జరగలేదు. జరుగనీయలేదు మహామాత్యులవారు. తాను పంచమ దేవాలయ ప్రవేశాన్ని చాటు బెట్టుకుని చేస్తున్న అరాచకానికి రాజు సుముఖంగాలేదన్న సంగతాయన మొదటనే పసిగట్టాడు. సర్వాధికారైన రాజెప్పుడైన తన ఉద్యోగాని కంతరాయం చెప్పవచ్చు. అందుకని ముందాలోచనగల బ్రహ్మనాయుడు కొన్ని కీలకాలు తన గుప్పిట పట్టుకోదలంచాడు. నలగాముడాయన దారికడ్డు తగిలితే, అప్పుడు తానాడవలసిన రాజకీయ చదరంగంలో నుపయోగపడే పావులులాగా మలి దేవాదులను తీర్చిదిద్దుకున్నాడు.

బ్రహ్మనాయుడు నడిపించే చాపకూటి రుచితో బాటు అవినీతి రుచులు గూడ జీర్ణించుకున్న మలిదేవాదుల కిపుడాయననే మార్గదర్శి. ఆ మాయదార్ వైశంలో పడిపోయిన కొమ్మరాజు మొదలైనవారికి గూడ నాయుని యాన నారాయణమూర్తి యాజ్ఞవంటిది. వారిపుడు మలిరాజును వీడి నలగామునివంక చూడడం లేదు.

నిజానికారాజ్యం మైలమదేవి పుట్టింటి వారిచ్చినందున స్త్రీ ధనమయింది. మాతామహులిచ్చిన సొత్తుకు మనుమడే సర్వాధికారిగాని వాని సవతితల్లుల పిల్లల కెటువంటి యధికారములేదు. నలగాముడు తన తమ్ములని దయచూడకపోతే మలి దేవాదులకక్కడ నిలువనీడలులేవు. నలగామునకు మగసంతానం లేనందున్న రత్నాల పేరమ్మ రాజ్యానికి వారసురాలు. పేరమ్మ పేరుమీదుగ కాబోవురాజు అలరాజు. ఆ కారణంగా తండ్రికొడుకులైన కొమ్మరాజు అలరాజులకు నల్లగామ

రాజు మీద నిజమైన ప్రేమాభిమానాలున్నా-లేకపోయినా రాజ్యసింహాసనం తమ చేతికి చిక్కిందాకనైన మహారాజున కనుకూలంగా మసులుకోదగిన వారై కూడ మలిదేవుని పక్షంచేరి బ్రహ్మనాయుని చేతిలో మంత్రించిన మరబొమ్మలు కావడం శోచనీయం.

నలగామునికిది తెలియనిదేమీకాదు. కాని పరిస్థితులు చేదాటి పోయినయి. ఇప్పుడెవరి నేమనడానికి సావకాశాలు లేకపోయాయి. అలరాజెంత పేరమ్మ నాదరింపక పోయినా కూతురుమీది కూర్మితో వియ్యాల వారితో విరోధం పెట్టుకోలేక బోనులోపడ్డ సింహంలా చిక్కుబడిపోయాడు.

నరసింగరాజు నలగామునికి యింకొక సవతితల్లి కుమారుడు అయినప్పటికి కళ్యాణపురం బాంధవ్యరీత్యా మలిదేవుడు వచ్చినంత దగ్గరకు రాలేకపోయాడు. కాకపోయినా మేఘుంతా అనుగురాజు రక్తం పంచుకొని పుట్టిన అన్నదమ్ములమన్న అభిమాన మాయనలో మూర్తీభవించింది. అన్నగారి ఆత్మ విచారం అర్థం చేసుకొనిన బుద్ధిమంతుడు కూడను. తమ్ముడుగా, సేనాధిపతిగా, రాజసేవకుడుగా తన జీవితాన్ని సమర్పించిన మహాశయ సంపన్నుడు నరసింగరాజు. నరసింగరాజు లోని న్యాయదక్షత సోదరప్రేమను గూడ అవగాహన చేసుకున్న నలగామున కిపుడీ తమ్ముడే నమ్మదగిన యాత్మీయుడయ్యాడు.

## నరసింగ రాజాడిన నవనాటకము

ఒకనాడు నలగామ భూపతి పరివారాన్ని వెంటబెట్టుకుని వేటాడ బయలు దేరాడు. వారిలో నరసింగరాజు కూడ వున్నాడు. అడవినంతా కలియతిరిగి వేట

డిన రాజపరివారమంతా అలసిపోయింది. అప్పటికి ప్రొద్దు నడిమింటికి వచ్చినం దున యెండకూడ తీవ్రమయింది ఎండలో కష్టపడిన వారికి దాహపీడనము అధిక మయింది. ప్రతి మనిషి మంచినీటికై తపించిపోయే సమయంలో నరసింగరాజు "అన్నయ్యా! నాయకురాలు నాగమ్మ నివసించే ఆశ్రమం సమీపమునందే యున్నది. మన రాక తెలుసుకుని మనకై పచ్చాకు పందిరి వేయించి అల్పాహారము తీయడానికి రంటూ ఆహ్వానమంపింది కూడాను. మనమిపుడా చలువపందిరిలో విశ్రాంతి తీసు కొనుటయు మంచిదే ననుకుంటాను. మీరేమంటారు?" అన్నాడు.

"అనేదేమున్నది తమ్ముడూ! అంతగా పిలిచినపుడు పోకపోవడ మెందుకు? అందులోను నాగమ్మ యనిన నాకు మంచి యభిప్రాయమున్నది. దైవమును గ్రహించినేదేని మేలు జరుగ గలదు. కాకపోయినను మనకిప్పు డవసరములయిన ఒనరులు సమకూడనున్న చోటునకు పోవడమే మంచి"దన్నాడు. నరసింగరాజు వారందరును వెంటబెట్టుకుని నాగమ్మ ఆశ్రమానికి చేరుకున్నాడు. పోయిన వారందరకక్కడ పందిరి క్రింద నీడ లభించింది. చల్లగాలి వీచుకొన విసనకర్రలు దొరికినై. తినడానికి పండ్లు, త్రాగడానికి చెఱకురసం సమకూడినై, నలగాము డంతట నాగమ్మతో "యీనాడు నీవు చేసిన ఈ యుపకారము మరచిపోలేని" దన్నాడు.

"పరోపకారం చేయడంలో నాగమ్మకు పెట్టిన పేరన్నగారూ!" అంటూ అందుకున్న నరసింగరాజు "ఆమె తలచుకుంటె బ్రహ్మనాయుని దురంతాలనంత మొందించి ప్రజాభ్యుదయం ప్రతిపాదించగల సమర్థురా" లన్నాడు.

నాకేదో గొప్పతన మంట గట్టుతున్నారన్నది. నాగమ్మ నవ్వుతూ.

"అంటగట్టితే గొప్పతన మంటుకొనేది కాదు నాగమ్మా! మా గురజాల పరిస్థితులు నీకు తెలిసే యుండవచ్చును. మహామాత్యులవారు నడుపుచున్న పంచమ దేవాలయ ప్రవేశోద్యమం చాటున జరిగే" — అని యింకా చెప్పబోతున్న నరసింగరాజు మాట కడ్డు వచ్చిన నాగమ్మ "నాకు తెలియనిది కాదులె" మన్నది. నరసింగరాజు తిరిగి "మీరీ సమయంలో గురజాల మంత్రిపదవిని చేపట్టి జరుగుతున్న కుళ్ళును కడిగివేస్తేనే కాని—

నిజమే—అని ఆగిపోయింది. నాగమ్మ.

సందేహం దేనికి—అన్నాడు నలగామరాజు

"చూడండి! రాజపదవి యెంత భోగ ప్రదమయిందో యింకొక రూపంగ అంత భయంకరమయింది కూడను, ధర్మపాలన అనేది సామాన్యమైన పనికాదు. ప్రజలలో శాంతి భద్రతలు నెలకొల్పడానికి - అంటే ఎదురయ్యే వ్యతిరేక శక్తుల నణచి వేయుట పట్ల ప్రభువు లొకొక్కప్పుడెంత త్యాగమయినా చేయవలసి వస్తుంది. గురజాల పాలకుల కవియన్ని తెలియవని నేను చెప్పడంలేదు—చెప్పగల దాననుకూడ" కానన్నది నాగమ్మ.

మీరీ విషయంలో జోక్యం కలిగించుకొనడానికి—

మనవి చేస్తున్నాను మహారాజా! మీరాజ్ఞాపించినపుడు నేను మారిపోగల దాననుకాను. కాని, సర్వాధికారులు లోక విషయాన్ని గమనించవలసియుంటుంది. ప్రభూ! మీకూ తెలిసినదే...పదవీవ్యామోహం నాకు చాలా దూరం ధనలోపంచేత

పొట్టనింపుకొనడానికి రాజాశ్రయం కోరే పని నాకు లేదు. నాయునిమీద పంతం నాకంతకన్న యుండదు. ఐతే పంచమ దేవాలయ ప్రవేశమనే మహాశయాన్ని ఆస్కారంగా పెట్టుకొని, ఆ తెరచాటున జరుపుతున్న మంత్రిగారి మహాదారుణా చారాన్ని నిరోధించి ప్రజలందరకు న్యాయం కలిగించే ధ్యేయంతో నేనేది చేసినా ప్రభువులు నా కంతరాయం చెప్పరా!" దని సూటిగ అడిగింది నాగమ్మ.

అందుకే ఎదురు చూచుచున్నా నన్నట్లుగా నలగామరాజు వెంటనే "నాగమ్మా! నాకు కావలసింది ప్రజాభ్యుదయం పాలనా విధానంలో యెటువంటి పొరపాటులు లేకుండ చక్కగా తీర్చిదిద్దే నీ రాజకీయ వ్యవహారాలకు "నేనే మాత్ర మంతరాయం చెప్పనని పరమేశ్వర పాదసాక్షిగా ప్రమాణం చేస్తున్నా" నన్నాడు.

నాగమ్మ కూడ "ఐతే వినండి ప్రజాభ్యుదయాన్ని ప్రధానాంశంగా పెట్టుకొని, ఎదురైన దుష్టశక్తులను తుడిచిపెట్టడానికి రాజకీయ రంగంలో నేనే తంత్రం పన్నినా-శాసనములు పరచినా నా స్వార్థానికిగాని వ్యక్తిగత ద్వేషాలకుగాని స్థానముండదని నేనా పరమేశ్వర పాదసాక్షిగ ప్రమాణం చేస్తున్నా" నన్నది.

నరసింగరాజంత లేచి నాగమ్మగారు వెంటనే అమాత్య పదవి స్వీకారం చేయాలంటూ నాటి సమావేశాన్ని ముగింపు చేశాడు.

# మహారాజు నెపరించిన మలిదేవాదులు

నాగమ్మ అడుగుపెట్టిన తోడనే రాజకుటుంబంలో కలహం తలయెత్తింది. బ్రహ్మనాయుణ్ణి యెదిరించడానికి నాంది నాగమ్మ నిరసించిన పంచమ దేవాలయ ప్రవేశమయింది. దానితో నాయుడుగారికి తలమీద పిడుగు పడినంత పనయింది. పంచములను దేవాలయ ప్రవేశావకాశం కావాలని నాయుడు అక్కరలేదని నాగమ్మ చేసిన వాద ప్రతివాదాలు తీవ్రరూపందాల్చినై, నలగామరాజెటూ మాటాడలేదు. బ్రహ్మనాయుని కది తలవంపుగా తోచినందున "ఈ కొలువులో నా బాధ్యత నేటితో తీరిపోయిం"దంటూ మంత్రి పదవికి రాజీనామా ఇచ్చి యెవరిమాట కెదురు చూడకుండా చరచరా సభనుండి వెళ్ళిపోయాడు.

నాటికి కొలువు ముగిసినది.

మరునాడు మళ్ళీ రాజు కొలువు దీరాడు. బ్రహ్మనాయుడుగూడ సభకు వచ్చేశాడు. కాని తన మామూలు మంత్రిస్థానం విడిచి సామాన్య ప్రజలలో కూర్చున్నాడు. మలిదేవాదులు వారివారి స్థానాల నాక్రమించారు. కొంతసేపటికి బ్రహ్మన్న లేచి, "మహారాజా! మాదొక - విన్నపం — మన్నించాలి" అన్నాడు. ఏనాడూ వినబడని యీ క్రొత్తమాటలు సభలోని వారినందరినీ కలవర పరిచినై. నలగామరాజు "మీరు చెప్పేదేమిటి?" అన్నట్లుగా వారివంక చూశాడు.

"నలగామ భూపాలా! మీ తండ్రిగారు చనిపోతూ పసివారైన మిమ్ములను యీ గురజాల రాజ్య సంరక్షణా భారమును నా చేతులలో పెట్టిన సంగతి మీరీనాటికి మరచిపోయి యుంటారు — అంతే అప్పటికి మీరు చంటివారైనందున— ఆనాటినుండి ఈనాటివరకు నేను రాజకుటుంబం పట్ల చూపిన విశ్వాసాభిమానా లెట్టివో మీకు గాని ప్రజలకుగూడా తెలిసినదే కావచ్చును. ఆ కాలం గతించి

పోయింది. ఇప్పుడవన్నీ త్రవ్వుకొనడ మప్రస్తుతం కావచ్చును. నీ విపుడు సర్వాధికారివయ్యావు. నరసింగరాజు స్వతంత్రుడయ్యాడు. మలిదేవాదు లింకా మమ్ము నమ్ముకునేయున్నందున వారి మంచి చెడ్డల చూడవలసిన బాధ్యత తీరలేదు వారి పక్షాన నేనడుగుతున్నాను. అనుగురాజుకు వీర విద్యాదేవియు భార్యయే కనుక సోదర న్యాయంబుగా మలిదేవాదులకు కొంత రాజ్యం పంచి యీయవలసినదిగా కోరుతున్నాను. దాని యాధారంగ నేను వారిని గూడ మీయంత వారిని చేసిననాడు. మీ నాన్నగారికిచ్చిన మాట నిలబెట్టుకుంటా"నని కూర్చున్నాడు.

అందుకు సమాధానమీయ లేసిన నలగామరాజు ప్రశాంతముగనే "అమాత్య బ్రహ్మనాయులవారి యాజ్ఞ మాకవశ్యాచరణీయము, ఐనను రాజ్యాంగ ధర్మ నిర్ణయముల నతిక్రమించి స్వతంత్రించ గల అవకాశముగాని, అధికారము గాని, నాకులేవు. మీరు మాకు తండ్రి యంతటివారు. ఇంతవరకు మేమును తమ మాట కెదురు చెప్పినవారము కామని తెలియని వారెవరునులేరు. మీరనినట్లు నేటి కది కొంత మార్పు చెందింది. ప్రభువులు సర్వాధికారులైనను వారికి కొన్ని పరిధు లున్నవి. రాజును సైతము శాసింపగల ధర్మవాణి ప్రజల ముఖం నుండి వెలువడు తుంది. కావున మీరిపుడు సూచించిన రాజ్య విభాగం పట్ల ప్రజాభిప్రాయము ననుస రించిచేయుట కర్తవ్యంతరముతే" దన్నాడు.

అన్నగారిచ్చిన అవకాశము ననుసరించి లేచిన నరసింగరాజు "రాజసభా సదులకు నమస్కారం. ఇప్పుడిక్కడ నొక ధర్మచర్చ ప్రారంభమయింది. మా సోదరులలోని వారైన మలిదేవాదులకు రాజ్యభాగం కావాలని మహామంత్రుల వార డుగుచున్నారు. అయితే—యింతకు ముందు ఎక్కడైనా ఎవరైనా రాజ్యమును తమ్ములకు పంచియిచ్చిన అన్నలున్నారా! అని నా ప్రశ్న? రాజ్యము పంచుకొన దగినది కాదు—రాజ్యసింహాసనమును చీల్చుటకేనాడును ధర్మశాస్త్ర మంగీకరించి

యుండలేదు. అను జన్మలెంత ప్రయోజకులైనను—ఎందరయినను రాజ గౌరవ వేతనములను పొందుటకే గాక రాజ్యమున పాలు పంచుకొన నర్హులుకారు. అలా పంచుకునే పరిస్థితిలో భూరమాదేవి బిడ్డలమైన మేమును సోదరులమే. మేమును రాజ్యభాగ మడగమను నిర్ణయమును లేదు. లమాత్యుల వారన్నట్లుగ మలిదేవాదులు పసివారైనందున తెలియక భాగ మడిగిరేమో— ఇంతకాలము మహామంత్రి పదవి నిర్వహించి—రాజ్యాంగ ధర్మముల సాంగోపాంగముగ నెఱింగి—యితరులకు చెప్పనేర్చిన మహామంత్రి బ్రహ్మనాయుడుగారే ధర్మశాస్త్రము ననుసరించి రాకుమారులకు పాలీయమను చున్నారో మేము వినగోరు చున్నా"మని కూర్చున్నాడు.



ఎప్పుడెప్పుడూ యని ఎదురు చూచుచున్న నాగమ్మ లేచి నిలబడింది. "ధర్మము చెప్పగల పెద్దలకు నా విన్నపము. ప్రస్తుత మీ గురజాల మంత్రి స్థానమున నున్నది నేను. ఇది రాజ్యాంగమునకు సంబంధించిన దగుటచే నేను జోక్యము కలిగించుకొనక తప్పదు. మహారాజా అనుగరాజ నరేంద్రులకు మలిదేవాదులను వివాహమాడిన భార్య యందుదయించిన కుమారులన్నమాట పరమ సత్యం. తండ్రియాస్తిమీద కుమారు లంతరకును సమానాధికారములున్న మాటయు న్యాయబద్ధం. అయితే యిది రాజ్యాంగం. రాజ్యాంగ విధానంలేదు. రాజ్య సింహాసనాధికార మొక్క పెద్ద కుమారునకేగాక, మిగిలిన సోదరులు రాజగౌరవ వేతనముల పొందుటకు మాత్రమే సంపూర్ణాధికారులై యున్నారు. అటులయ్యును అది యీ గురజాల రాజకుటుంబానికి మాత్రం సంబంధించుటలేదు. ఏలనన? — వలనాటి రాజ్యం అనుగురాజు స్వార్జితమైన యెడల కుమారులందరును తండ్రిసొత్తు మీదధికారులే.

చందవోలు ప్రభువులు కుమార్తె వివాహకాలమున నీ పలనాడు అల్లుని కరణముగా నీయబడింది. మైలమదేవి తన పుట్టింటినుండి తెచ్చుకొనిన రాజ్యంమీద నామె కుమారునకు మాత్రమే సర్వాధికార మున్నదికాని—మైలమదేవి సవతులయందుదయించిన వారికి నిలువ నీడ లైననులేదు. స్త్రీ ధనమైనందున ముందొక నాటికైన నిది పేరమ్మకు చెందవలసి యున్నది. కావున మలిదేవాదులు కిచట మాటలాడనైన చోటులేదని నేను తీర్మానించుచున్నాను. కాదని సహేతుకముగా సమర్థింప గలవారున్న నా వాదమును పూర్వపక్షము చేయవచ్చు"నని కూర్చున్నది.

సభలో కొందరి ముఖాలు నవ్వినై, కొందరి ముఖాలు మాడినై. జనంలో రాజ్యం పంచి యీయకపోతే మలిదేవాదులు యుద్ధానికి తలపడతారనే గుసగుసలు బయలుదేరినై. అప్పటి కేమీ నిర్ణయింపలేని నలగామరాజు మఱునాటికి వాయిదా వేశాడు.

## న్యాయపాలన చేసిన నలగామరాజు

మూడవనాడు మళ్ళీ రాజసభ కోలాహలంగా నిండిపోయింది. ప్రభువులే విధంగా తీర్మానం చేస్తారో విందామని జనమంతా తహతహ లాడుతున్నారు. నలగామరాజు సభలోని వారివంక చూచి "అయ్యలారా! బ్రహ్మనాయుల వారి సందేశాననుసరించి మలిదేవాదులకు రాజ్యభాగ మీయడమా! నిరాకరించడమా! అనేది మన మిపుడు పరిష్కరింప దగినదై యున్నది.

నరసింగరాజు సూచించినట్లు రాజ సోదరులకు పాలు పంచుకునే అధికారం లేదు. నాగమ్మ వివరించినట్లు వీరవిద్యాదేవి కుమారులు రాజగౌరవ వేతనము పుచ్చుకునే అవకాశమునులేదు, లేకపోయినా రాజ్యకాంక్ష గల రాచబిడ్డ యెవరిమీదనైనను

పోరాడవచ్చును. అప్పుడు బాంధవ్యములు చూడవలసిన పనిలేదు. న్యాయవిచారణ గూడ చేయనవసరముండదు. స్వతంత్ర పాలనాధికారమును కోరుచున్న మలిదేవాదులు యుద్ధం చేయడానికైన వెనుదీయరని నేననుకుంటున్నాను. యుద్ధం వలన ధననాశనం – జన నష్టం కలుగక మానదు. రాజు గత్యంతరం లేకపోయి నప్పుడు తప్ప రక్తపాతమున కంగీకరింపరాదు.

మలిదేవాదులు క్రొత్తనగరం నిర్మించుకొనడానికి ద్రవ్యమిస్తున్నాను. ఈ ధర్మం నా తమ్ములందరకు వర్తిస్తుంది. ఇక్కడ అడిగిన వారికొక న్యాయం - అడుగని వారి కింకొక న్యాయం జరుగదు. నాకున్న సవతితల్లు లిరువురు, భూరమాదేవి కుమారులైన కామరాజు నరసింగరాజాదుల కొక ద్రవ్యనిధిని - వీర విద్యాదేవి కుమారులైన మలిదేవాదుల కొక ద్రవ్యనిధిని కేటాయించుచున్నాను. ఇంత మాత్రమున నానుండి చీలిపొమ్మని నేనెవరిని శాసించుటయు లేదు. స్వతంత్ర పాలనము నందభిరుచి కలిగి క్రొత్తనగరం నిర్మించుకొన దలంచినవారు నిరాటంకముగ వారి కీయబడిన ద్రవ్యమును తీసుకొని పోవచ్చును. లేక నా దగ్గిరనే యుండ దలంచినవారు వారికై విభజింపబడిన యీ నిధిని యిందే కలపవచ్చును. అందులకు యిందులకు గూడ నేనామోదించుచున్నాను" అన్నాడు.

రాజసేవకు లంతట రెండు పళ్లెములలో ద్రవ్యమును దెచ్చి రెండు బల్లలమీద నుంచి తిరిగిపోయారు.

నలగాముని మాటలు వింటూనే నరసింగరాజు, నాగమ్మ లొకరి మొగమొకరు చూచుకొని "ధర్మనిర్ణయం జరిగిం"దన్నారు. మలిదేవ బ్రహ్మనాయు లొకరిమొగ మొకరు చూచుకొని "మన సంకల్పం నెరవేరింది" అన్నారు. సభలోని ప్రజలంతా ఒకరిమొగ మొకరు చూచుకొని "భళిరా! మైలమ్మ కుమారా! ఎంత నేర్పరి వయ్యా!" అన్నారు. నరసింగరాజు లేచి "అన్నా! తండ్రికి పెద్దకుమారుడవు-

ఇంటికి పెత్తనపుదారివి - ధర్మమూర్తివి మాకు నీవే కావాలి. వేరే రాజ్యమక్కర లేదు. నిన్నే సేవించి మా భ్రాతృభక్తి రాజభక్తిని మేము నిలుపుకుంటా"మంటూ ద్రవ్యనిధి పళ్లెరమునెత్తి నలగామువి ముందుంచి, "మనల నింతకాలం నుండి పెంచి పెద్దవారినిచేసి మన మంచి చెడ్డలు చూచిన బ్రహ్మనాయ మహామాత్యులవారి యాజమాన్యములో మేము నూతన నగర నిర్మాణం చేసికుంటాం" అంటూ ద్రవ్యనిధి పళ్ళెరము నెత్తి నాయుని చేతులలో పెట్టాడు.

## మాచర్ల నగర నిర్మాణము

చంద్రవంక నదీతీరాన గురిజాల కారుక్రోసుల దూరంలో మలిదేవాదులు బ్రహ్మనాయుని యాజమాన్యాన మాచర్ల నగరాన్ని నిర్మించుకున్నారు. దానికి పెదమలిదేవుడు రాజు బ్రహ్మనాయుడు మంత్రి కన్నమదాసు సైన్యాధిపతిగను పదవులు స్వీకరించారు. మాచర్లలో నిర్మింపబడిన చెన్నకేశవాలయం ప్రతిష్ఠ బ్రహ్మనాయుడు చేశాడు. దేవాలయం విశాలమయింది- సుందరమయింది. నూతన పట్టాభిషేక సందర్భంగా మాచర్ల వారాహాన్వాలు గురజాల కంపించారు. కాని యెవరూ రాలేదు. మహామాత్యులవారే స్వయంగా కట్నాలు గురజాల రాజకుటుంబాని కంద జేశాడు.

కన్నమదాసు మాచర్లవారి సైన్యాన్ని అభివృద్ధి చేస్తున్నాడు.

కల్యాణము నేలు సోమభూపాలునకు మలిదేవుడు అల్లుడు కొమ్మరాజు అల రాజు లాయింటి దాయాదుతే, ఇపుడీ మాచర్ల కల్యాణముల రాజులలో స్నేహం కూడ పెరిగింది - కల్యాణము మీదికి పరరాజులు దండెత్తి వచ్చినందున సోముడు మాచర్ల రాజుల సాయం కోరాడు. బ్రహ్మనాయుడు దండులకామోదించి కలిపయు

సేనలతో కళ్యాణం రాజులను తోడిపోయి శివపురం రాజుల నోడించాడు. అంతే కాకుండ యుద్ధానంతరం శివపురంమీదపడి ధ్వంసంచేసి అక్కడున్న శక్తిదేవతా మూర్తులను తరలించుకొని వచ్చి త్రిపురాంతకంలో నిలుపుమన్నాడు. ఆ సమయంలో సైన్యంతోగూడ శ్రీశైలం వచ్చే భ్రమరాంబాదేవికి కుంకుమపూజ మల్లికార్జునస్వామికి సహస్రబిళ్వదళార్చన మహాన్యాస పూర్వకంగా చేయించిన తరువాత విజయగర్వంతో తిరిగివచ్చి మాచర్ల చేరుకున్నాడు.

బ్రహ్మనాయుని భార్య ఐతమ్మ ఆమె కుమారుడు బాలచంద్రుడు. నాయుడుగారు తానారాధించే చెన్నకేశవుని పేర బాలచంద్రుని "చెన్నా" అని ముద్దుగ పిలుస్తుంటాడు. బాలుడు మంచి సొగసైనవాడు. చురుకైనవాడు వానిననుసరించిన వారైదుగురున్నారు. వారంతా బాలుని అన్నా అని అంటుంటారు వారిలో అనపోతను బ్రాహ్మణ బాలుడు ముఖ్యుడు. బాలచంద్రుడా యల్లరిగుంపును వెంటబెట్టుకుని వీధులలో తిరుగాడే యితర పిల్లలను కొడుతుంటాడు. పోవుచున్న ఐండ్ల చీలలూడ బెరుకుతుంటాడు. ఏమైనాగానీ మహామంత్రిగారి గారాబాల కుమారుడు కనుక వానినెవరేమి అనలేదు.

బాలునికి యుక్తప్రాయం వచ్చింది. మేనమామ గండుకన్నమనీడు. ఆయనగారి కుమార్తె మాంచాల. మాంచాల సౌందర్యవతి. విద్యావతి వివేకవతి శీలవతి కూడాను. ఆమెను బాలచంద్రునకిచ్చి వివాహం చేశారు. ఆ పెండ్లి సమయంలో ఓ పెద్ద గొడవ జరిగింది. కన్నమనీడు ఓలి కావాలని యడిగాడు. ఐతమ్మ మేమీయమన్నది "నీ పెండ్లినాడు ఓలి యిచ్చారు. మీరన్నివిధాలా బాగున్నారు మనకిది సాంప్రదాయమని" తమ్ముడు చెప్పినా అక్క "ఆ రోజులువేరు. యీ రోజులు వేరు ఓలి యిచ్చేదితే"దన్నది కన్నమనీడు. దానికంగీకరించలేదు. ఐతమ్మ ఆనాటి

ఆడబిడ్డగా- యీనాటి వియ్యపరాలుగా అలిగి ఐదురోజులు పట్టుపట్టింది. కన్నమనీడు తెగబడి నీ వక్కవయినాసరే అలిగినాసరే ఓలి యీయ వలసిందే" నన్నాడు.

ఇక తప్పని సరయింది. బండిమీదకెక్కి బ్రహ్మనాయుని యింటిలోని బంగారపు వరహాలను తూరుపార పట్టినట్లుగా చేటలతో యెత్తి రాశిపోయించారు. అందులో చెదిరిపోయి ప్రక్కలబడినవానిని పొల్లు వరహాలంటూ కుప్పబడిన వరహాలలో యేడు కుంచాలు కన్నమనీడు ఓలి తీసుకున్నాడు, బ్రహ్మనాయునికది క్రొత్త వియ్యాలవారిమీద కోపకారణమయింది. కోడలును కాపురానికి తీసుకు రాకుండ మానుకున్నాడు. నిజంగా నాయుడుగారికా యభిప్రాయం లేకపోతే మాంచాలతో స్వయంగా "అమ్మాయీ! లేక లేక కలిగిన ఒక్కగానొక్క కొడుకై నందున బాలుని మేము గారాబంగా పెంచాం. కాని వాడిలా వేశ్యాలోలుడై నిన్ను చూడకుండా వుంటాడని మేమనుకోలేదు.

ఏనాటికైనా నీ కాపురం బాగుండటమే నాకు కావాలి."

"చూడమ్మా ! మీ యత్తగారు నీకు మేనత్తగాని పరాయివారు కారు. మనది రాజకుటుంబం. నీ పెనిమిటే సంపాదించి నీ కన్నవస్త్రాలీయవలసిన పనిలేదు. కనుక నీవిపుడిలా పుట్టింటనుండే దానికన్నా మెట్టినింట నుండటమే మంచిది. ఎప్పుడైన మొగంచూచి నీ మగనికి నీ యందనురాగం కలుగవచ్చు"నని బ్రహ్మనాయుడని అంటె వారి దాంపత్యం బాగుపడి యుండేది. అలా ఆపడానికి బ్రహ్మనాయుడే ముందుకు రాలేకపోయాడు. తమ మాట కాదని ఓలి తీసుకున్నను కన్నమనీని మీద యీ విధంగా తీర్చుకోవాలని నాయుడుగారే కొడుకు కోడండ్ర యెడబాటుకు కారకుడయ్యాడని ప్రజలంతా చాటున చెప్పుకుంటున్నారు.

బాలచంద్రుడంతకుముందే తండ్రిగారి మాచర్ల దేవాలయంలోను నడుపుతూన్న స్వేచ్ఛావిసీతి రుచికి లోబడిపోయిన విలాసమూర్తి. ఆమీద వేశ్యాలోలుడు వానికింక భార్యతో పనేమున్నది? పాపం మానవతియైన మాంచాల మధుర జీవితం అడవిన గాచిన పండువెన్నెలలా వ్యర్థమైపోతూంది. ఆమె స్థితి చూచిన తల్లి దండ్రులా విచారాన్ని పైకి పొక్కలేకా మనసు నందిమిడించికొననూ లేక కుళ్ళి పోతున్నారు.

# నాగమ్మ పన్నిన పన్నాగము

నాగమ్మ చారుల నియమించి యెప్పటికప్పుడు మాచర్ల వార్తలు తెలిసికొంటూనే వున్నది. సభదీరిన నలగామరాజు మాచర్లలో మలిదేవుడెట్లున్నారని" అడిగాడు నరసింగరాజు లేచి "అన్నా! బ్రహ్మనాయుని తెరచాటు నాటకం నిరాటంకముగా జరుగుతూనే వున్నది. గురజాలలో మాయ నాకు తెలియరాదనే భయమైన యుండెడిది. ఇప్పుడక్కడ వారి నెదిరించే వారేలేరు. అనాచారం ప్రబలమయింది. అనరాదు కాని-ఒక విధంగా బ్రహ్మనాయుని చాపకూటి సిద్ధాంతాలకు మీరు స్వయంగా డబ్బు యిచ్చి-దూరంగా పంపి అవినీతిని మరింత బాహాటంగా విస్తరింపచేసిన వారయ్యారేమోననిపిస్తుంది" అన్నాడు.

న్యాయం సహనంగల నలగామరాజు తల పరికించి "నీవన్నది నిజమే తమ్ముడూ! నా మంచితనం మంచికన్న చెడునే మిక్కుటంగా కలిగించిందనక తప్పదు. బ్రహ్మనాయుడిక్కడ చేయుచున్న అనాచారమక్కడ లేకుండా చేసినట్లయితే అలరాజాదులు తిరిగి మన చెంతకు వచ్చి యుండెడివారు. బాలచంద్రుడయిన

మాంచాలతో కాపురం చేసుకొని యుండెడివాడు. అటరాజు, బాలచంద్రులు సంస్కారం పొందలేకపోగా మరింత మోహితులైపోవుచున్నందున మహామంత్రుల వారి వ్యాపారం మారలేదని తెలుస్తూంది. దానిని సరిదిద్దడం మన కర్తవ్యమంటాను. దీన్ని నాగమ్మ గారేమంటారు?" అన్నాడు.

నాగమ్మ లేచి "ప్రభూ! మాచర్ల మలిదేవాదుల కెంత స్వాతంత్ర్య రాజ్యమైనా దాని నిర్మాణమునకు ద్రవ్యమిచ్చిన మీకు అందలి మంచిచెడ్డలు చూచే అధికారం పోలేదు. ఒకప్పుడు లేకపోవచ్చునుగాక ప్రక్క రాజ్యంబు నందరాజకము ప్రబలి నపుడు సాటిరాజు లెవరైనను పాలకుల నెదిరించి ప్రజలకు న్యాయము చేకూర్చు టయు క్షత్రియ ధర్మములందు ప్రధానమై యున్నది. అదియును గాక- మనకు సంబంధించిన వ్యక్తులక్కడున్నారు. వారిని రప్పించుకొనుట మన కర్తవ్యము. మాచర్లలో జరుగుతూన్న యవినీతి మాన్పవలయునంటే మలిదేవాదుల చేతిలోని మాచర్లను ముందుగా మనం మనచేత పట్టుకోవాలి."

అదెలా సాధ్యం ?

బ్రహ్మనాయునికి కోడిపందెములన్న మితిలేని ప్రేమ. రేపు రానున్న సంక్రాంతి పండుగ సందర్భముగా కోడిపందెముల కాహ్వానించి- పందెమున నోడించి మాచర్ల రాజ్యమును మనం చేజిక్కించు కొనుటయే చేయదగినదని నా అభిప్రాయం.

నరసింగరాజందుకొని "నాగమ్మ యోచన యుక్తియుక్తముగనే యున్నది. బ్రహ్మనాయునికి కోడిపందెముల భ్రాంతి యన్నమాట నిజమే ఆయనకందు ప్రావీణ్యము కూడ కలదు. పందెమున మనమే గెల్చి వారినోడించగలమను నమ్మక మేమున్నది ! దానివలన ఫలితమేమున్న"దన్నాడు.

నాగమ్మ తిరిగి "అదే రాజ్యాంగ తంత్రం. మన పందెపు పుంజుకు కొలతలు తీసి యినుపకవచం చేయించాలి దానికి సరిపడిన రంగులు వేయించాలి. నేర్పరులయిన పనివారలను నియమించి పందెం సమయంలో యితరుల కంటబడకుండా పుంజుకా కవచం తొడిగి పని పూర్తికాగానే తీయించే యేర్పాటులు చేయించాలి. మహారాజా! ఇందులో స్వార్థమెంతమాత్రమూలేదు. కుటుంబ కలహం ప్రబలం కాకుండ అశాంతి కార్యక్రమములు తలెత్తకుండ, మాచర్ల రాజ్యాపాలనాధికారం మన చేతికి రావడం అవినీతిని హరించడమే ప్రధానములని మనవి చేస్తున్నాను.

అంతేకాదు కోడిపందెంలో మన మోడించేది మాచర్ల పాలకులయిన మలిదేవాదులను మాత్రమే. రాజ్యమోడిపోయిన రాజులు వలస పోక తప్పదు. మన కొమ్మరాజుల రాజులకు వలసపోవలసిన యగత్యముండదు. మలిదేవాదులు తిరిగి వచ్చువరకైనను మీరీ గురజాల యందుండునని మనము కొమ్మరాజును, అలరాజు నిందుండ నియమింపవచ్చును. ఆ సమయంబున మన పేరమ్మ అలరాజుల దాంపత్యము చక్కబడిన మహానందము కాగల"దని వచింప నలగామరాజు సంతసించాడు.

సంక్రాంతి వెళ్ళిన కనుమపండుగనాడు మేము జరుపబోవుచున్న కోడిపందెమునకు రావలసినదంటూ గురజాలనుండి మాచర్లకు వార్తపోయింది. బ్రహ్మనాయుడందులో ఆరితేరిన చేయి కనుక గురజాలవారిని తేలికగా యోడించవచ్చును. నాగమ్మ మీద పగదీర్చుకొనవచ్చుననుకొని కోడిపందానికి అంగీకారం తెలిపాడు.

## మాచర్లలో ఓడిపోయిన మలిదేవాదులు

మహాసంక్రాంతి వెళ్ళిన మరునాడు కనుమ పండుగ సందర్భముగ కోడి పందెములు వినోద కార్యక్రమములుగ నియమింపబడినై. తాటాకు పందిళ్ళు

వేయబడినై. మంచినీటి చలివేంద్ర లమరింపబడినై, చిన్న చిన్న చిరుతిను బండా రాల దుకాణాలు గూడ నెలకొల్పబడినాయి. ఇక కల్లు సారా కొట్లమాట చెప్ప నవసముండదు. గురజాల ప్రభువులు మాచర్ల ప్రభువులును కోడిపందెపు క్రీడా రంగం దగ్గరకు చేరుకున్నారు.

బ్రహ్మనాయుని పరివారమంతా ఓటమి నెరుగని పందెగాంద్రమన్న హుందాతనంతో మత్తుపదార్థాలు సేవించి మైకంలో మునిగున్నారు. నాగమ్మ తన పరివారాన్ని చేరబిలిచి "అతి మెలకువతో పందెం గెలిపించడం మీ వంతు-పారి తోషికాల నిప్పించడం నా వంతు. పని ముగిసిన తరువాత మీమీ విలాసాల మీరను భవించవచ్చును. పనికి ముందు పరాకు పనికిరా"దని హెచ్చరించింది. నమ్మకంగల సుబ్బన్న సూచన లనుసరించి పందెపు పుంజుకు యినుప కవచం తొడిగి సమయం వచ్చినదాకా దానిని చాటున దాచుంచాడు.

నిర్ణీతకాలంలో పందెం ప్రారంభమయింది.

తొలి పందెంలో గురజాలవారు దించిన బెరవజాతి పుంజును మాచర్లవారి కాకి డేగ జాతిపుంజు ఓడించింది. మలిపందెంలో గూడా గురజాలవారి పందెపు పుంజులను మాచర్లవారి వింజాచెరసజాని పుంజు చంపింది. ఇక మూడవ పందెంలో ఓడిపోయినవారు వారి రాజ్యాన్ని గెలిచిన వారికిచ్చి ఏడేండ్లు వలసపోయేనిర్ణయం చేసుకున్నారు. గురజాల వారిపుడు సుబ్బన్న దాచియుంచిన పుంజును నేలమీద విడిచిపెట్టారు. మాచర్లవారు మాంచి పౌరుషంగల పుంజును విడిచారు. నిజానికి కవచం లేకపోతే నాగమ్మ పుంజెపుడో పడిపోవలసిందే. ఆ కారణంచేత నాయుడు గారి పుంజుకు బాగా శ్రమ కలిగింది. అది చూచిన మలిదేవాదులు "మన పుంజు పందెం విలువ తెలుసుకొని పోరాడుతుంది" అని అనుకొని నవ్వుకున్నారు. కాని నవ్వెంతసేపో నిలువక మరుక్షణంలోనే వారి పుంజు దెబ్బతిని పడిపోయింది. వారంతా పడిపోయిన పుంజును పరామర్శించే సమయంలో కనుమరుగున కోడి మీదనున్న కవచమూడదీశాడు.

పందెంలో మాచర్ల రాజులు పరాజయం పొందారు. గురిజాల పరివారంవారు మాచర్ల దొరలకు మీసాలు లేవు- వారి పుంజులకు రోసాలు లే"వని పాటలు పాడారు. మాచర్ల నగరం నలగాముని వశమయింది. నాగమ్మ 'నరసింగరాజు' నల గామరాజు తెన్నివిధాల చెప్పినా వినకుండా కొమ్మరాజు అలరాజులు మలిదేవాదు లతో పాటు వలసపోవడానికే బ్రహ్మనాయుననుసరించారు. మాచర్లదొరలంతా ఏలే శ్వరం చెంత కృష్ణానదిని దాటి మండాది పట్నం చేరుకున్నారు. మండాదికి సమీ పంలో ఒక కొండ-ఆ కొండనుండి గ్రామం పక్కగా ప్రవహించే సెలయేరు. ఆ చక్కదనాల సెలయేరు దరులందలి రమణీయ ప్రకృతి జనాకర్షణీయమైంది.

బ్రహ్మనాయుడు తన సమూహమునంతా వెంటబెట్టుకుని దొమ్మర్ల రేవు దగ్గర కృష్ణను దాటి శ్రీశైలంపోయి భ్రమరాంబ సమేత మల్లికార్జున స్వామికి రుద్రాభిషేకములతో సేవలు చేయించిన తరువాత నా సీమను పాలించుచున్న మూకరాజును దర్శించారు మూకరాజు వారందరను అతిధిమార్యాదలతో గౌరవిం చాడు. ఆ సమయంలో రాజును బ్రహ్మనాయుడు తన వీరఖడ్గం కుదువబెట్టుకుని కోటి బంగారు నాణెముల రుణమిమ్మని యడిగాడు. కాని-మూకరాజందుల కంగీ కరింపక పాలనలోని మార్కాపురం, త్రిపురాంతకం మొదలైన యిరువదిమూడు గ్రామాలను గుత్తకిచ్చాడు. మలిదేవులా సదవకాశాన్ని ఉపయోగించుకొని వీర మేడపిలో కాలం గడుపుతూండగా గడవు యేడుసంవత్సరాలేగాక యింకా ఆరు మాసాలు దాటిపోయినై.

కోడిపందెముల నాటి నిర్ణయం ప్రకారంగా మాచర్లను తిరిగి మాకీయ వల సిందిగా అలరాజును రాయబారమంప నియమించాడు బ్రహ్మన్న. కొమ్మరాజున కామాట వినడంతోనే గుండె గుభేలుమన్నది. కొడుకును గురిజాల పంపడానికి శంకించిన కొమ్మరాజుతో నాయుడుగారు "బావగారూ! భయపడకండి. నేను దూరమాలోచించే మన రాంమల్లును రాయబారిగా నెన్నుకున్నాను. ఇన్నినాళ్ళ

తరువాత యింటి యల్లుని రాక విని నలగాముడానందించగలడు. కుమార్తె మొగం చూచయినా గురిజాల ప్రభువులు సంధికామోదించెదరను తలంపున నేనీ పనికి పూనుకున్నాను. నీ వనుమానించినట్లు నాగమ్మ మొదలైన వారివలన అలరాజున కపాయము సంభవించునను భీతి నాకులేదు. ఒకవేళ అలాగా జరిగితే నీ కుమారుని ప్రాణాలకు బదులు నా కుమారుని ప్రాణాలిస్తాను. బావా! నీ కొక్కడే కొడుకు నాకూ ఒక్కడే కొడుకు. కడుపుతీపి నాకు తెలియనిదా!" అన్నాడు.

కొమ్మరాజింక కాదనలేకపోయాడు.

అలరాజు రాయబారిగా గురిజాలకు ప్రయాణమయ్యాడు.

## తిరిగి రాలేకపోయిన అలరాజు

అలరాజు రాయబారిగా వచ్చుచున్న వార్త విని నలగామరాజు ఆనందంతో బాటు ఆందోళన పాలయ్యాడు. నరసింగరాజు, నాగమ్మలు సంధి కుదరనీయని మాట సత్యం. అయినా అలరాజు క్షేమంగా తిరిగి వీరమేడపికి చేరకపోతే మనం నిందాస్పదులం కాగలమనే భయంతో తగిన జాగ్రత్తలు తీసుకొనడం మంచిదే. అలరాజుకు నచ్చజెప్పి వానిని మా పక్షం త్రిప్పడానికి గూడా మావారు ప్రయత్నించుచున్నారు నా యేకైక కుమారి రత్నాలపేరమ్మ యదృష్టమెట్లులున్నదో" అని అనుకుంటున్నాడు.

అలరాజు క్షేమంగా గురిజాల చేరుకున్నాడు.

రాజమర్యాదలు జరిగినై.

రాజసభ కేతెంచిన అలరాజు నే నిపుడు రాజకుటుంబ తగాదాలలో రాయబారిగా మాటాడవచ్చినాడనేగాని రాజబంధువుగా మర్యాదలను పొందడానికి రాలేదు అది మీకును తెలియనిదికాదు: కోడిపందెములనాటి నిర్ణయంతో ప్రకారం

మాచర్ల రాజులు ఏడు సంవత్సరాల వలస పూర్తి చేయడం జరిగిపోయింది. ఇక వారి మాచర్ల నగరం వారికి తేమవలసినదిగా నాచే రాయబారమంపించారు. ఎదుటి వారి సందేశం మీకు వినిపించాను- తరువాత మీరిచ్చిన సమాధానం వారికి అందీయడం నా ధర్మ"మంటూ కూర్చున్నాడు.

సలగామరాజు నాగమ్మవంక చూచాడు.

నాగమ్మ నవ్వింది "రాజకుమారా! రాయబారిగా నీవు చెప్పిన మాటలు నాకు నచ్చినై. ఆనాటి నిర్ణయమేమిటో నీవుగాని వారుగాని అర్థం చేసుకొనలేదని నేనిపుడనుకుంటున్నాను. "మాచర్ల మీకీయాలి-మీరేడేండ్లు వలసపోవాల" అని కదా! అంతే ఏడేండ్ల తరువాత తిరిగి మీ రాజ్యం మీకిస్తామని మేమనాడన లేదు. యీనా డిచ్చునదిలేదు. ఇదే మా సమాధాన"మన్నది.

నాగమ్మ చిరునవ్వు నవ్వింది. "అలరాజా! చెపుతున్నాను విను. మాచర్ల మాకు స్వాధీనమయింది. పాతకాలమునాటి పాలకులైన మలిదేవాదులు "మేమిపుడు పాలకులము కాము-పౌరులముగానే మాచర్ల యందు నివసించుచున్నా" మన వచ్చును. ముందొకనాటికి మాకిందు కొన్ని యధికారములున్నవనియు నెదిరింప వచ్చును. అట్టి యవకాశము లేమియు లేకుండుటకుగాను మలిదేవాదులకు సంబంధించిన వారెవరును మాచర్ల పొలిమేరల యందైన నుండరాదని - వారి కందధికారము లేదని రుజువు చేయుటకై యేడేండ్లపాటైన మా ప్రాంతములందుండరాదని వలస చేయుమంటిమేకాని తరువాత మాచర్లను తిరిగి మీకిచ్చెదమనిలేదు. ఓడిపోయినవారు నగర మీడిపోవుట బాగున్నది. ఏడేండ్లు వలస చేశారు బాగున్నది- మాచర్ల మేమియ్య నవసరములేదని వారికి చెప్పు"మన్నది.

ఈ సమాధానమునే నీవు వారికందించి నీ ధర్మం నెరవేర్చుకొమ్మన్నాడు నలగామరాజు.-నాగమ్మ తీర్మానాన్ని సవరించకుండ—

"సరే- నేను వచ్చిన పనియైన" దంటూ లేచాడు అలరాజు.

నరసింగరాజు వెంటనే "రాజకుమారా! ఇంతవరకూ జరిగింది రాయబార మును గురించి ప్రసంగం అయిపోయింది. ఇక నీవు మా యింటి యల్లుడవుగా నేను చెప్పదలంచిన మాటలున్నవి గూర్చుండుము. ఈ రాజ్యము మీ మామగారి తల్లియైన మైలమదేవి పుట్టింటి వారిదగుటచే స్త్రీ ధనమై యున్నది. అనుగురాజ భూపాలుని పెద్దకుమారుడుగ కూడా గురిజాల సింహాసనం నలగామ భూపాలుని పాలితం బగుట ధర్మమైయున్నది. ఇప్పుడీ నరేంద్రులకు మగసంతానం లేనందున రత్నాలపేరమ్మ దీనికి వారసురాలు. ఆమె భర్తవగు నీ రాజ్యమునకు కాబోవు సర్వాధికారివి.

పినకుమారునిగా చెప్పుచున్న నా మాట విని నీవు నీ తండ్రితోగూడి గురి జాలకు వచ్చి నీ క్రొత్తకాపురమును సరిదిద్దుకొని రాజ్యపాలకుడవు కమ్మని నా కోరిక" అన్నాడు.

నిలుచున్న అలరాజు కూర్చొనకుండగనే "మాపుగడిచినగద రేపటిమాట ? మీ సమాధాన మాలకించిన మాచర్ల ప్రభువులు కత్తిదూసి కదనరంగం మీద దుముకకున్న నున్న గదా గురిజాలరాజ్య సింహాసనానికి కుదురుబాటు లభించు నది ? ముందు మహాప్రళయం ముంచుకొని వచ్చుచుండ ముచ్చటలు చెప్పుకుని మురిసిపోయే మందమతిని కాను, సర్వ సేనా నాయకుల వారి సందేశానికి సమా ధాన మీయడమయింది. ఇకపోతున్నా" అని బయలుదేరిన అలరాజు నిరపాయ కరంగా గురిజాల దాటాడే కాని చర్లగుడిపాడు యొద్ద వానిని నెవరో పొంచియుండి చంపివేశారు.

అలరాజును చంపించినవాడు నరసింగరాజా ? బ్రహ్మనాయుడా ?

# త్రిపురాంతకము చేరిన మలిదేవాదులు

అలరాజు మరణవార్త విని నలగామరాజు పుట్టెడు దుఃఖంలో మునిగి పోయాడు విధులు తప్పవుకావున అల్లుని భౌతికదేహం తెప్పించి దహన క్రియలు చేయించే సమయంలో తన ముద్దుల కుమార్తె నాటి సాంప్రదాయము ననుసరించి సహగమనం చేసింది. నిండుప్రాణాల పేరమ్మ మగనిశరీరంతో బడి మాడిపోయిన దృశ్యం చూచిన వారందరి హృదయాలు ఘోషించిపోయినపుడు కన్నతండ్రి హృదయమెంతగా అల్లాడిపోయిందో మూహింపలేము.

రాచమల్లు చనిపోయిన వార్త వీరమేడపికి మూడురోజుల కందింది. కొడుకును కోల్పోయి గోడుగోడున వాపోవు కొమ్మరాజుతో బ్రహ్మన్న బావగారూ ! నేనను కున్న దొకటి—అయిన దింకొకటి. ఏకైకపుత్రిక మీది యనురాగమున సంధి కంగీ కరించు ననుకొంటినే కాని, పూర్వ బాంధవ్యమును పూర్తిగ తెంపి వేయుటకా నాగమ్మ యింత సాహసాని కొడిగట్టుతుందనిగాని— రక్తసంబంధంగల నరసింహ రావు యింత పనిచేస్తాడనిగాని నేనూహించలేక పోయాను. నీ కుమారునిప్పుడు పంపరానిచోటకు పంపించి పగవారిచేతుల కప్పగించి ప్రాణాలు తీయించిన పాప కర్ముడను నేనయ్యాను. బావా ! నీ కుమారుని చంపించిన ఆ నరసింగుని తల నరికించి నీకు చూపనిదే నేనింక బ్రహ్మనాయుడను గాను" అని శపథం చేశాడు.

బాలచంద్రుడు దుందుడుకు వాడైనా తండ్రి కపటం తెలియని యమాయకుడు. బ్రహ్మన్నగారి నాటకం బూటకమని యనుకొనలేనందున చివాలున లేచి మామా ! అలరాజు నంత మొందించిన నాగమ్మ ప్రాణంబులు నాగులేటు గలిపి - నరసింగ రాజు తలగొట్టి నీకు చూపకున్న నేను బ్రహ్మనాయుని పుత్రుడనే గా"నని ప్రతిన చేశాడు

గురిజాల రాజసభలో అలరాజు మరణాన్ని గురించిన విచారణ ప్రారంభమైంది! నలగామురాజా యాలోచన కొనసాగనీయలేదు. "నరసింగరాయ నాగమ్మలారా! జరిగిన దేదియో నా కర్థమగుతూనే యున్నది. బ్రహ్మనాయుడు సామాన్యుడు కాడు. అలరాజును మాచర్ల మహామంత్రిగారే చంపించినారని నెఱుంగుదును. రాయబారమునకు వచ్చిపోవునపుడు చంపించుటలో వాని యోచన వేరు. అలరాజు నంతమొందించిన హంతకులు మీరిద్దరేనని భావింతుననియు గాన "నాకింత ద్రోహ మొనరించిన మీరు నాకేల నని నాగమ్మను మంత్రి స్థానమునుండి - నరసింగరాజును సైన్యాధిపతి స్థానము నుండి తొలగింతుననియు, తరువాత నేనా బ్రహ్మనాయుని మంత్రిత్వము - కన్నముని సైన్యాధిపత్యముల వహింపుడని ప్రార్థింతు ననియు బ్రహ్మన్న పన్నిన పన్నాగము.

అదిగాక - పూర్వ మొకానొక సమయంబున యీ బ్రహ్మనాయుని అన్న బాదరాయునికి మన అలరాజుకును వాగ్వివాదం జరిగి చివరకు ఒకరి నొకరు చంపుకొనబోవు వరకును వచ్చినది! అలరాజు రాజబంధువైనందున ముందు యోచనగల బ్రహ్మన్న నాటికా వైరమును యుక్తియుక్తంబుగ శాంతి పరచాడు. అప్పటి నాయుడు అలరాజుమీద పగసాధింపనెంచిన రహస్యము నాకు తెలియును. కాని చెప్పినను తెలిసికొనలేని ఆ తండ్రికొడుకులు కసాయివానినే నమ్మి మన మంచితనాన్ని గమనింప లేకపోయారు. అలరాజును చంపే యవకాశ మిపుడా బ్రహ్మనాయునికి దొరికింది.

ఇంత కష్టాలోచన కడుపున పెట్టుకుని అలరాజుని రాయబారిగా పంపించినాడా పాతమంత్రి. దీనితో వాని సంకల్పం నెరవేరింది-నింద యింకొకరిమీద పడింది. మలిదేవాదులకు సింహాసనాధికారం కలుగుతుంది. అలరాజును చంపించిన వారమను నెపంతో మనమీద యుద్ధం ప్రకటించడాని కిదియొక పన్నుగడ.

నా మంచితనమున ముందేనాటికైనా నా కుమార్తె జీవితము బాగుపడునను కొంటిని కాని చివరకు నా యింటి దీప మారిపోవునని నేను తలంచలేదు. ఇంత జరిగిన తరువాత యుద్ధానికయినా వెనుకాడుటెందులకు! కావలసిన పనులు కానీయండి" అన్నాడు బిగువుగల తెగువతనంతో.

నరసింగరాజు, నాగమ్మ లొక్కసారి గట్టిగా గాలిపీల్చి ఒదిలి లేచారు "అమ్మయ్యా!" అంటూ తేలికపడిన గుండెలను చేతితో సవరించుకుంటూ.

వీరమేడపి రాజులు యుద్ధానికి సిద్ధమై కత్తులు దూశారు. ఖండన భూమికి బయలుదేరుతూ వీరమేడపికి మలిదేవులలో చిన్నవాడయిన బాలమలిదేవుని రాజును చేశారు-బాలచంద్రునికి మహామంత్రి స్థానమిచ్చారు. మలుని మంత్రులలోనివాడైన అనపోతునకు కరణీకపు పదవి నిచ్చారు. మాడచి యనుదాసుకి అంతఃపుర పాల నాధికార మొప్పగించిన తరువాత బ్రహ్మనాయుని యాజమాన్యంలో మలిదేవును కతిపయసేనా సమేతంబుగా ఒకరోజు చూచుకొని కదనానికి బయలుదేరిపోయి త్రిపురాంతకం చేరుకున్నారు

## కారెంపూడి చేరిన మలిదేవాదులు

కయ్యానికి కాలుదువ్విన నాయుడుగారు తన మందీమార్బలంతో త్రిపురాంతకం పోయి విజయం కలిగించండి అని వేల్పులను వేడుకున్నాడు. అంతకు పూర్వం శివపురం నుండి తెచ్చి నిల్పిన శక్తుల నారాధించాడు. స్తంబం రూపంలో నున్న ఒక దేవతామూర్తిని పూజించాడు. రకరకాల పిండివంటలు, కూరలు, పాయసాలు, అన్నం కుంభం పోయించి, మైసాక్షి సాంబ్రాణి - మంచి గుగ్గిలం పొగలు వేయించి - మేకపోతులను కోసి బలిదానమిచ్చాడు. అన్నీ అయ్యాక ఆ స్తంబాన్ని పెకలించి బండిమీద గట్టించాడు. ఆ బండివెంట మరికొన్ని బండ్లు బయలుదేరినై.

నాయకులంతట "అందెల బసవన్న! అదినాథ! నందుల పిండిగంట! నాగవాస! గోవులవిటగాడు! గోగుబయ్యన్న! పర పెరుమాళ్ళు! అంబుదిశయన! బిరుదు గరుత్మంత! భీమగజ! గోవర్ధనాచల గోపాలదేవ! కరినందిబసవన్న కంబరద! నెల బాలచంద్ర! నీలవర్ణ! జయకంఠనాథ! వైకుంఠవాస! వాసుదేవ! పుట్టి భూపతి! పుంజెల్లు పెద్ద! ఇప్పగిరీశ! గోగుభైరవమూర్తి! గోవిందరాజ! చెంచుల ఓబయ్య! చెన్నమల్లయ్య! కంచియేకాంబర! కాళిదాస! కామా! సోమా! రామా! భీమా!" అని పెట్టుకున్న ముద్దుపేరులుగల మదపుటెద్దులను పరుసగా పిలిచి బండ్లకుగట్టి అదిలించారు.

గణగణ గజ్జల మ్రోతలతో! ధణధణ గిట్టల చప్పుడలతో త్రిపురాంతకం నుండి ముందుకుసాగిన మలిదేవుని సేనలు వినుకొండ తాలూకాకు చెందిన మర్రి వేముల! గుమ్మనంపాడు! గరికెపాడు గ్రామములమీదుగా పల్లెకు చేరినై. అక్కడ బ్రహ్మనాయుడు, మలిదేవుడు, రాజకుటుంబమువారు, యోధుల మనుకున్న వారంతా వీరకంకణాలు ధరించారు. వీరకంకణాలు ధరించిన చోటుకనుక బహుశ ఆ పల్లెకు కంకణాలపల్లె యను పేరు వచ్చినదేమో తరువాత వీరులంతా పైడిపాడు దాటి సందచీకటిపడు వేళకు మేళ్ళవాగుచేరి మజిలీ చేశారు.

చీకటి పడుచుండగ బ్రహ్మనాయుడు కన్నముని పిలిచి "దాసూ! నీ విపుడే కారెమపూడికిపోయి నాగులేటి యొడ్డున స్మశానము మనకెంతవరకు అనుకూలముగ నున్నదో చూచి రమ్మనాడు. కన్నమదాసు కాపనకుండ ఆ చీకటిలోనే మేళ్ళ చెరువున కారుమైళ్ళ దూరాననున్న కారెమపూడికి ఒంటరిగ పోయాడు. అసలే చీకటిలో కలిసిపోయే నల్ల శరీరం మెలికలు తిరిగిన కండలు—గంభీరమైన ముఖం-కావిపంచె-తలపాగ, కోరమీసం-ఒరలో కరవాలం-చేతిలోపట్టు కర్ర-కాలికి అందె గలవాని రూపంచూచి స్మశానంలోకి భూతాలు సమీపించినై కాని కన్నము డొక్క సారి గట్టిగా హుంకరించి కత్తి ఝుళిపించినంతనే యెటు భూతాలటు పారిపోయినై..

# భంగపడిన భట్టు రాయబారము

తెలతెలవారు సరికి తిరిగి మార్కి చెరువు చేరిన బ్రహ్మనాయుడు బ్రాహ్మణులకు దానాలనిచ్చి సైన్యంతో కారెంపూడి వచ్చి చేరాడు. ప్రముఖులైన వారందరూ గంగాధర మడుగున స్నానాలుచేసి శివలింగాలను స్థాపనలు గావించి పూజించారు. మనకీనాడు గంగాధర మడుగు తీరాన కనపడే లింగా లానాటివేనని జనవాదుక. బ్రహ్మనాయుడు గారంతట భట్టును రాయబారిగా గురజాలకు పంపించాడు.

నలగాముడు సభదీరియుండగా భట్టు తన రాయబారం సారాంశమంటూ "మీరు మీ నరసింగరాజును మాకు పట్టియిచ్చి యీ యుద్ధం జరుగకుండా సంధి చేయడం మంచి"దంటూ సెలవిచ్చాడు. ఆ మాటలు వింటూనే నలగాముని ఒడలు మండిపోయింది. "మగసిరి గల మానవుడెవడూ తన తమ్ముని పట్టి యీయడని తెలియదా! ఆ పని చేయమనిపస్తే వారు చేయుదురా! మాటాడుటకు మంచి మర్యాద లవసరములు లేవా?" అన్నాడు గంభీరంగా.

నాగమ్మ అందుకుని "మహారాజా! వంశనాశనానికి దుర్జాతివాడైన జాతి మొకడుండెు యింకా నిప్పేందు" కన్నది వీరవిద్యాదేవి కుమారులను గురించి యెత్తి పొడుస్తూ.

భట్టుకామాట శూలం పోటులా నాటింది. "నలగామా! నీ యల్లుని చంపి నీ కూతురు సహగమనానికి కారకుడైన నలగాముని తలమీద కెక్కించుకుని భగవంతుని వంటి బ్రహ్మనాయుని నిరాకరించడం మంచిది కా"దన్నాడు.

నలగాముడు రోషంగా "బాలరాజు చావుకు కారకులెవరో తెలియని మంద మతిని కాను. భట్టూ! ఇక నీ మాటలు చాలించు, సైన్య సమేతంగా సమరభూమికి వచ్చాక సంధి రాయబారమంపిన బ్రహ్మన్నగారి సదభిప్రాయ మర్థమగుచునే

# భంగపడిన భట్టు రాయబారము

తెలతెలవారు సరికి తిరిగి మళ్ళీ చెఱువు చేరిన బ్రహ్మనాయుడు బ్రాహ్మణులకు దానాలనిచ్చి సైన్యంతో కారెమపూడి వచ్చి చేరాడు. ప్రముఖులైన వారందరూ గంగాధర మడుగున స్నానాలు చేసి శివలింగాలను స్థాపనలు గావించి పూజించారు. మనకినాడు గంగాధర మడుగు తీరాన కనబడే లింగా లానాటివేనని జనవాడుక. బ్రహ్మనాయుడు గొరంతల భట్టును రాయబారిగా గురజాలకు పంపించాడు.

నలగాముడు సభదీరియుండగా భట్టు తన రాయబారం సారాంశమంటూ "మీరు మీ నరసింగరాజును మాకు పట్టిఇచ్చి యీ యుద్ధం జరుగకుండా సంధి చేయడం మంచి"దంటూ వివరించాడు. ఆ మాటలు వింటూనే నలగాముని ఒడలు మండిపోయింది. "మగసిరి గల మానవుడెవడూ తన తమ్ముని పట్టి యీయడని తెలియదా! ఆ పని చేయమనిపస్తే వారు చేయుదురా! మాటాడుటకు మంచి మర్యాద లవసరములు లేవా?" అన్నాడు గంభీరంగా.

నాగమ్మ అందుకుని "మహారాజా! వంశనాశనానికి దుర్జాతివాడైన జాతి యొకడుంటె యింకా నిప్పేంది" కన్నది వీరవిద్యాదేవి కుమారులను గురించి యెత్తి పొడుస్తూ.

భట్టుకామాట శూలం పోటులా నాటింది. "నలగామా! నీ యల్లుని చంపి నీ కూతురు సహగమనానికి కారకుడైన నలగాముని తలమీద తెక్కించుకుని భగవంతుని వంటి బ్రహ్మనాయుని నిరాకరించడం మంచిది కా"దన్నాడు.

నలగాముడు రోషంగా "ఖలరాజు చావుకు కారకులెవరో తెలియని మంద మతిని కాను. భట్టూ! ఇక నీ మాటలు చాలించు, సైన్య సమేతంగా సమరభూమికి వచ్చాక సంధి రాయబారమంపిన బ్రహ్మన్నగారి సదభిప్రాయ మర్థమగుచునే

యున్నది. నీతి నిజాయితీకల రాజు లెవరేనియు వివాదాలు సంభవించినపుడు ముందుగా రాయబారమంపి, సంధి కుదరనపుడు యుద్ధమునకు వచ్చుచుంటిమని చెప్పిన తరువాత కదనభూమియందు ప్రవేశించెదరుకాని-ముందుగా వారన్నియు సవరించుకొని వచ్చి యుద్ధరంగమున కూర్చున్న తరువాత ప్రయత్నమున లేని వారిని పోరాడరమ్మనట్టి పనులు బుద్ధిమంతులు చేయునవి కావు "మేము సమర సన్నాహమున లేము-సమరమాడ రాజాల" మంటిమేని మమ్మవమాన పరచవలయు నని మా బలహీనము నెరింగి మాపై దాడి చేయవలయుననిగదా?" అని నిశితంగా విమర్శించాడు.

నలగాముని మాటలకెదురుగా చెప్పలేని భట్టు "రాజా! బ్రహ్మనాయుని బల మెట్టిదియో నీ వెఱుగనిదికాదు. ఆయనకు దైవసహాయమున్నది. ఇంత గనుకనే యుద్ధమందు నపజయము నొందని నాయుని యెదిరించిన సింహములట్లు గర్జనలు చేయుచున్నారు. నీ కధిక సైన్యమున్నదని గర్వించు చుంటివి కాని సింహము ముందు మేకలమంద యెంతయుననేమి చేయగలదు! నీవీ సంధి కొప్పు కొనకున్న వారు నిన్ను నీ పరివారమును నీ గురజాల రాజ్యమునుగూడ సర్వ నాశనము గావింపక విడువ" రనగ నలగాముడు నాగమ్మవంక చూచి "రాజసభా మర్యాదలు గాని-రాయబారి బాధ్యతలుగాని తెలియని వీనికి బుద్ధి చెప్పి వెడలనంపింపు" మన్నాడు.

మహాకోపంతో నాగమ్మ హుంకరించుచూ "భట్టూ! ఇక నొక్కమాటేనియు తక్కువ యెక్కువ లాడితివేని నిన్నేనుగు కాళ్ళక్రింద త్రొక్కింపక విడవను- ముందు నీవిచటినుండి లేచి వెళ్ళెదవా-నేను మెడబెట్టి నిన్ను బయటకు గెంటిం పనా!" అనగా కిక్కురు మనకుండా భట్టులేచి నిలబడ్డాడు. నరసింగరాజు "ఔను! మొదట రాయబారము సేయవచ్చిన అలరాజును మేమే చంపితిమని యింతకు ముందు నీవును అని యుంటివిగదా! సంధి చేయవచ్చు రాయబారులను చంపు

చున్న యీ గురజాల ప్రభువులయొద్దకా బ్రహ్మన్న నీవును మా చేతులలో చావ వలయుననియే పంపినాడా! నీవు చావవలయుననియే వచ్చితివా!" అనగా సభలోని వారంతా గొల్లుమని నవ్వారు. ఒంచిన తల యెత్తకుండానే భట్టు దారిబట్టాడు.

## కారెమపూడికి చేరిన నలగామాదులు

గురజాలలో రాజసభ జరిగింది. నలగామరాజు పరివారంవంక చూచి "మాచర్ల యోధులంతా అరువదేడ్గురె-కొలదిగ మూక సైన్యముండవచ్చును. వారి శిబిరములన్నియు చెట్లక్రిందకు చాలవు. మనకు రాజ పెద్దలనాటి ధనమున్నది-ధాన్యమున్నది. సంఘమున్నది, ఉండుగాక - చిన్నపామునయినను పెద్ద కర్రతో కొట్టవలయునని పెద్దలు చెప్పియున్నారు నాయుడు మహాకపటి, ఏదియో మాయోపాయము పన్నకయే యీ సాహస మొనరింపడు. అజాగ్రత్త కూడనిది. మనకు యుద్ధమున సాయమొనరింపగల రాజులందరకు తోడుసేయ రండని జాబులు వ్రాసి పిలిపించండి. సేనలను యుద్ధసన్నద్ధుల చేయం"డని తగిన కట్టుదిట్టములు చేశాడు.

నరసింగరాజు నాగమ్మలు వ్రాత పనివారల నియమించి ధరణికోటనేలు భీమదేవునకు-ఎడమాడెము నేలు నెరుకామునకు- చోళరాజు సూర్యకుమారునకు మానుగుండంరాజు- గోలంకిరాజు - ఘూర్జరదేశపురాజు, జొన్నాళ్ళరాజు, పొదిలె రాజు, ధాన్య కటకంరాజు, దేవాద్రిరాజు, చంద్రగిరిరాజు, బంగాళదేశపురాజు, పాండ్యరాజు, మళయాళరాజు, కర్ణాటకరాజు, మురగసేనుడు, కల్వరాయుడు, పెదబాహుపతి భీమసేనుడు, జయదేవుడు, జయసింగు వీరభళ్ళాడు మొదలయిన రాజులందరకు యుద్ధసహాయము చేయరండని ఉత్తరములు వ్రాయించారు.

నలగామభూపతి బ్రాహ్మణుల చేత సుముహూర్తం పెట్టించి సైనికుల ప్రోత్సహించు కొని తగిన సన్నాహంతో పట్టపుఏనుగు నెక్కి కారెమపూడి వస్తూండగ త్రోవలో బ్రాహ్మణులు దూబచెరువు దగ్గర ఆశీర్వదించారు. అటు తరువాత కొదమగుండ్ల దగ్గర గ్రామపౌరులు దర్శించి "రాజేంద్రా! అన్నదమ్ములలో కయ్యమెందుకు? సంధిగావించి శాంతి కలిగించండి. ప్రభువులకు ప్రజలకుగూడ క్షేమకర"మని మనవి చేశారు. గురజాల ప్రభువులకు వారికి తగిన సమాధానము చెప్పి ముందుకు సాగి కారెమపూడి యుద్ధభూమిని చేరుకున్నాడు.

పిలుపులందిన వీరభల్లాణరాజు పన్నెండు వేలమంది భట సమూహంతో వచ్చి నలగాముని సేనలలో చేరాడు. అటులనే వేయిమంది కాల్బలము; గజబల ముతో జౌన్నాశ్వభూపాలుడు వచ్చాడు. పదహారువేల కాల్బలము, ముప్పది వేల గజబలంతో మాళవాధీశ్వరుడు వచ్చాడు. తొమ్మిదివేల కాల్బలము, ఒక వేయి అశ్వదళంతో వరంగల్ నుండి కాకతీయ ప్రతాపరుద్ర చక్రవర్తి పరివారాన్ని పంపించాడు. పదివేల కాల్బలముతో ప్రాచిదేవుడు వచ్చాడు. నీలిరంగు జండాల నీటైన భటుచయంతో బంగాళాధీశ్వరుడు వచ్చాడు. పదివేల గజబలం, యిరవైవేల కాల్బలంతో ఒరిస్సానేలు బలదేవ పురుషోత్తముడు వచ్చాడు—పది వేలాశ్వికదళం, లక్ష కాల్బలంతో కల్యాణమునేలు ఘూర్జర రాజులు వచ్చారు. వేయి మదపు ఏనుగులు, వేయి బంట్లతో మహాదేవీదాసుడు వచ్చాడు. పది లక్షల కాల్బలంతో ద్రావిడ భూపతులు కేరళధరణీశులు వచ్చారు. రెండు వేలాశ్విక దళంతో పద్మ సేనుడు వచ్చాడు. ఎనభై యెనిమిదివేల సైనికులతో గుండమ దేవుడు గొబ్బూరి రాజు మొదలయినవారు లెక్కలేనంతమంది యోధానయోధులు వచ్చి కలిసిన నలగాముని సైన్యం యిసుకవేసిన రాలనట్లున్నది.

వచ్చిన వారందరికి గురజాల ప్రభువుల వారి రాజమర్యాదలందినై. ఎవరికి తగినట్లుగా వారికి పటకుటీరాలమర్చబడినై. సైనికులకు భోజన వసతులు విశ్రాంతి

వసతులు చేయబడినాయి. ఏనుగులకు, గుర్రాలకు యితర జీవాలకు గూడ పాక లమరింపబడినాయి. ఆయుధాగారాలు నెలకొల్పబడినాయి. వైద్య కుటీరాలు వేయ బడినాయి. ఎటు చూచినా యెవరికీ కొరతలు కనపడలేదు.

## బాలచంద్రుడాడిన బొంగరాలాట

మాచర్ల నిర్మించిన క్రొత్తలలో చెన్నకేశవాలయమున మేళము సేయ వచ్చిన భోగము పడుచును చూచి భ్రమించిన బాలచంద్రుడు కన్నెరికంపెట్టి ఏడేండ్లు గడిచినాయి. వాని వయసిప్పటికి యిరువదైదేండ్లు నిండి యుండవచ్చును. బనను వానికింకా పడచుతనపు దుందుడుకు పనులు మానలేదు. మాచర్ల ప్రభువులు యుద్ధానికి వెళుతూ బాలమలిదేవుని వీరమేడపికి రాజును చేసినపుడే తన్ను మంత్రిని చేసిన విషయం పూర్తిగా మరచినట్లున్నాడు బాలుడు. తమ పెద్దలంతా యుద్ధానికి పోయివుంటె వారి పరిస్థితులేమిటో? వారికాయుధాలే కావలయునో? ఆహార పదార్థాలే కావలయునో? అని అనుకొనకుండ మహామంత్రిగారి ముద్దుల కొడుకు మంత్రి పదవికి వచ్చాకగూడ బాధ్యతలను గుర్తించకపోవడం మరువరాని శోచనీయం.

బాలున కాటలరంది పెరిగింది. తోడి బాలురతో గుమ్మడికాయలాటలాడి, చెరకు పందెములు వేసిన తరువాత తల్లిదగ్గరకువచ్చి అడుకొన బంగారపు బొంగ రాలు కావాలన్నాడు. ఐతమ్మ మొదట నీవిపుడాటలకు పోవద్దని బుద్ధులు చెప్పింది. కాని అల్లరిపిల్లవాని పోరు పడలేక చివరకు చేయించి యిచ్చింది. బాలుడు ఊరి వెలుపల చావురావుల యొద్ద రావిచెట్టు క్రింద చెలికాండ్రతో బొంగరాలాడుతున్నాడు. ఆ వినోదం చూడడానికి గ్రామంలోని కొందరమ్మ లక్కలు గూడాపోయి గుంపులు గూడారు. ఊరి జనాన్ని చూచిన ఉత్సాహంతో బాలచంద్రుడు చేకొలది బొంగరాన్ని విసిరాడు. అది చక్రానికి తగిలి రింగుమని యెగిరివచ్చి నిలబడియున్న కోమటి అన్నమ్మ కాలికితగిలి బొటబొటమని నెత్తురు కారింది.

అన్నమ్మ నోరు చేసుకొని "ఓరి! మిడిమేలపు గుంటడా! నీ ప్రతాపం ఆడ దాని కాలిమీద చూపకపోతే యుద్ధంలో పగవానిమీద చూపరాదా! నీ యయ్యలంతా గురజాల రాజులమీద సమరమాడపోతే సిగ్గులేక నీవిక్కడ బొంగరాలాడుతున్నా వురా! యుద్ధంలో నిన్ను యోధులు చుట్టుముట్టి నీ గుండెలలో యీటెలు గ్రుచ్చి పొడవ" అని యింకా యేమేమో యనబోవుచుండ బాలచంద్రుడు వినయంగా ఆమెను సమీపించి జరిగిన ప్రమాదాన్ని మన్నింపుమని వేడుకున్నాడు. వేలికి తగిలిన గాయం మాన్పుకునేందుల కామెకు కొంత సొమ్మిచ్చాడు.

అప్పటికైన ఆయన వీరమేడపికి క్రొత్తమంత్రియైన మాట జ్ఞాపకం రాక సరాసరి రాజభవనానికిపోయి ఐతమ్మతో "అమ్మా! మా నాన్నగారెక్కడకు పోయారు? ఎవరిమీద యుద్ధమాడబోయారు? ఏ దిక్కుగా పోయారు? చెప్పవమ్మా!" అన్నాడు.

బాలచంద్రుడు దుడుకైనవాడు. తండ్రిమాదిరే మంచిదయినా చెడ్డదయినా ముందు వెనుక ఆలోచించి సమయంచూచి సదుపాయంగా పనిసాధించే రకంకాదు. ఆవేశంవలన అపకారమైనా పొందవచ్చును కనుక బాలుడు యుద్ధానికిపోతే తిరిగి రాడనే భయం తండ్రికున్నది. నాయుడుగారు స్వయంగా "మన చెన్నని మాత్రం యుద్ధానికి పంపవల"దని చెప్పియున్నాడు. అదే భయమైతమ్మ మనసులోనే నిలిచి పోయింది. కుమారుని చూపు కదనరంగం మీదికి పోకుండా చేయడానికే వాని ఆటకాయితనాన్ని మందలించడం లేదామె.

తల్లి దాచిన గుట్టునిప్పుడు కొడుకు చెప్పుమని పట్టుబట్టాడు. ఆమె గుండెలు దడదడలాడినై. నోటమాటరాలేదు. దేహమంతటా చమటలు గ్రమ్మినై. కొంచెం సేపటికి తేరుకొని "బాబూ! నలగాము భూపతితో సంధి కుదరనందున మలిదేవున కండగా మీ నాన్నగారు యుద్ధము చేయుటకెక్కడకు పోయిరో వివరములు నాకు తెలియ"వని చిన్న అబద్ధమాడి తప్పుకుంది.

పట్టుదలతో నున్న బాలచంద్రుడు "అమ్మా! కారెమపూడి యొద్ద యుద్ధం జరుగుతూంది. నాన్నగారుకూడా అక్కడనే యున్నారు. తల మునిగిన యుద్ధ ధారంలో తండ్రి సతమతమవుతూంటే యీడువచ్చిన కొడుకు మేడలలో చేడియలలో వేడుకలలో ప్రొద్దులు బుచ్చవచ్చునా! కన్నకుమారునికి కర్తవ్యముపదేశించి కరవాలముదూసి కదనభూమి కంపవగిన నీవంటి వీరమాత యిట్లు వెనుక ముందాడరాదు. నాకు సెలవిచ్చి పంపమ్మా!" అన్నాడు. ఐతమ్మ కుమారుని యుద్ధానికి పోవలదని చెప్పింది. ప్రమాదకరమయిందని భయపెట్టింది. ఆ మాటలు బాలుని తలకెక్కలేదు.

భండన మన్నను బాలుడు భయపడుటలేదు.

ఐతమ్మ తిరిగి "బాబూ! మాకు మొదట చాలాకాలం వరకు సంతానంలేదు. దానధర్మాలు చేశాం— తీర్థయాత్రలు చేశాం - సంతర్పణలు చేయించాం— బ్రాహ్మణ వటువుల కుపనయనాలు చేయించాం. చివరకు నేను ప్రతిదినం వేకువజామున లేచి స్నానంచేసి గిలకబావిలో నీరునిపోసి దానిమ్మ పండ్లను నిత్యం బ్రాహ్మణులకు దానం చేస్తూన్న వ్రతం సంవత్సరం జరిపిన తరువాత నీవు కలిగావు. అది గాక ఒక్కగానొక్క కుమారుడవు. నిన్ను యుద్ధరంగానికి పంపి నేను బ్రతకలే" నన్నది.

అప్పటికిని కొడుకు తన మాట వినడంలేదు.

## అత్తకోడండ్రు చేసిన క్రొత్తాలోచన

ఐతమ్మకాలోచన పాలుపోక శీలమ్మతో "అత్తగారూ! మీ కుమారుడు తన కుమారుని యుద్ధానికి పంపవలదని చెప్పారు. నా కుమారుడు నా మాట వినకుండా

సమరానికి సన్నాహమవుతున్నాడు. మనకిపు డుపాయమేమి" టని అడిగింది. శీలమ్మ యోచించి "కోడలా? బ్రహ్మ వ్రాసిన వ్రాతను మనం తప్పింపలేము. నీవెంత చేతులడ్డముంచినా నీ బిడ్డ నిలిచేలాగ లేదమ్మా! అతులని ప్రయత్నం చేయవలదని చెప్పడంకాదు. నా కిపుడు తోచిన యాలోచన చెప్పుచున్నాను. కోడలు మాంచాల కోమలాంగి చక్కదనాల చుక్క. చదువు సంస్కారాలున్నపిల్ల. భార్యమొగం చూచయినా బాలుడు యుద్ధం మానుకొనునేమో. నీవు కుమారునికి "భార్య దీవెనలంది ఖండనభూమికి పొమ్మని గండువారింటకి పంపించు" మని చెప్పింది.

బాలచంద్రునిలోని బలహీనమేమిటో అమ్మకు జేజమ్మకు గూడా అర్థమైనదే. అందమైన ఆడపిల్ల కంటబడితే అబ్బాయి ముందుపని మరచిపోతాడని అత్తా కోడండ్రు నిర్ణయం చేసుకున్నారు. ఐతమ్మ కుమారునిచూచి "నాయనా! నీ ప్రయత్నం విరమించేదిలేదు. సమర రంగంలో శత్రువులను సంహరించి నీవు సలక్షణంగా తిరిగిరావాలని తల్లిగా నేను దీవిస్తున్నాను. భార్యగా నిన్ను దీవించి పంపవలసి యున్నది మాంచాల. గండువారమ్మాయి నిండుదీవెన లందుకొని యుద్ధానికి పొమ్మని చెప్పింది.

ఆ మాట వినడంతోనే బాలచంద్రుని మోము వెల వెల బారింది. కొంచెం సేపటికి తేరుకొని "అమ్మా! నాకు తల్లిదీవెనలైతే తిరుగులేదుకాని ఆలిదీవెనల కవకాశ మెక్కడిదమ్మా! మా పెండ్లయి యేడేండ్లు దాటినా నేనావిడ మొగం చూడలేదు. ఆవిడ నా మొహం చూచియెరుగదు. ఆలుమగలమయ్యామన్నమాటే కాని అందిందిలేదు. పొందిందిలేదు. అవసరం పడి అత్తవారింటికి పోతే అవమానం జరుగదనే నమ్మకము మాత్రమేమున్న" దన్నాడు ఐతమ్మ గూడా ఆలోచించింది. కుమారుని తనయింట గూర్చుండబెట్టి అత్తగారిని అంతఃపుర పరిచారికలను వెంట బెట్టుకొని మేనాయెక్కి గండువారింటికి పోయింది.

గండు కన్నమనీని భార్య రేఖాంబ - ఆనాటి యింటాడబిడ్డ—యీనాటి ఈపరాలు వస్తున్నారన్నవార్త వినినంతనే తలవారిని వెంటబెట్టుకొనివచ్చి యింటిలోనికి తీసుకొనిపోయి కూర్చుండ నియమించి మర్యాదలు చేసింది. ఇన్నినాళ్ళ తరువాయినా వచ్చిన అత్తగారిని చూడడానికి మాంచాల అందలం దిగివచ్చి అడపరంజిబొమ్మలా నిలుచుంది. ఐతమ్మగారి రాక కారణం తెలుసుకొనిన రేఖాంబ "మీ కోడలే మీకు సమాధానమిస్తుంది. మీ రిద్దరూ గండువారింటి యాడపడుచులే - రేచర్ల వారింటి కోడండ్రే కనుక మీరు మాటాడుకొనండి" అంటూ మాంచాల వంక చూచి చిన్న నవ్వునవ్వింది.

మాంచాల తన కడుపులో పొంగుతూన్న విచారాన్ని బలవంతాన తగ్గించుకొంటూ "నీ కొడుకు నామెడలో తాళిగట్టి నా బ్రతుకు యెగతాళి పాలు చేశాడే కాని, తనపాలు చేసుకొనలేదు. ఆయనగారికి సానితోనే సంసారం, వేశ్యతోనే వైభవమైనపుడు" అని యింకా అనబోతుండగా ఐతమ్మ లేచి మాంచాల తలమీద చేయివైచి నిమురుతూ "నీ కన్యాయం జరగలేదని నేనడం లేదమ్మా! ఇది మన కుటుంబ విషయం. నీ విపుడు పుట్టింటివారి మర్యాద—మెట్టినింటివారి మర్యాదను కూడా కాపాడవలసిన దానవయ్యావు. ఇది విడ్డూరము లాడుకొనుటకు పగ సాధింపుటకు సమయం కాదు. సహజ సంస్కారాలతో నీ భర్తను నీవీనాడు పరిదిద్దుకుంటే యిక మీద నీ బావ నీవాడే కాగలడు. ఉత్తమాదర్శ భారతాంగనవు— నీ కర్తవ్యం నీవు విస్మరింప"కూడ దంటూన్న అత్తగారివంక నమాయకత్వంగా చూచుచున్న మాంచాల తలవంచి "సరే మీ కుమారుని మా యింటికి పంపండి. నా ధర్మం నేను కాపాడుకుంటా" నన్నది.

ఆ మాటలతో వెయ్యేనుగుల నెక్కినంత బలం వచ్చిన ఐతమ్మ కోడలును

ముద్దాడింది. పెపరాలికి వినయాంజలి చెప్పి తనవారితో తిరిగి తన మందిరానికి పోయింది. బాలచంద్రుని ప్రయాణంచేసి అత్తవారింటికి పంపింది.

## సానితో సరసాలాడిన బాలచంద్రుడు

బాలచంద్రుని యుంపుడుగత్తె మొదటి పేరు సచ్చిమసాని. ఇప్పుడామె శ్యామాంగినిగా మారింది. అమ్మదగ్గరనుండి అత్తవారింటికని బయలుదేరిన బాలచంద్రుడు ముందుగా సాని మేడకు వచ్చాడు. ఎంతవారలయిన కాంతదాసులే నన్నట్లుగా వాకిట నిలబడగానే చరచర మేడమెట్లు దిగివచ్చి పరిచారిక "మాయమ్మ గారికి తలనొప్పి వచ్చింది" అనగా బాలుడు బిగ్గరగా "అటులనా! కారెమపూడి యుద్ధానికి వెళుతూ నిత్యావసరములకు తబ్బిచ్చిపోదామని వచ్చాను. నా దగ్గరకు వచ్చి ధనము పుచ్చుకునే కులాసా లేదు కాబోలు. పోనీతే ప్రాప్తం లేని దానికి ప్రాకులాడడ మెందుకు? వస్తానని ముందుకు సాగాడు. అంతలోనే ఎదు రయిగ శ్యామాంగి "మంత్రి కుమారులను పిలిచి మర్యాదలు చేయడం తెలియదా! పైకి రమ్మనవేమే!" అని పరిచారికను మందలిస్తూనే సరసునకు స్వాగతం పలికింది.

"నేను రావడం నీకు తలనొప్పిగా నున్నదటగా" అని చిరాకుపడుతూ బాలచంద్రుడు ముందుకు సాగబోయాడు. "ఆగండి" అంటూ చేయి పట్టుకొనిన శ్యామాంగి "మీరు రాలేదనే నాకు తలనొప్పి వచ్చింది. మిమ్ములను చూచాక యింకెక్కడుంటుంది. అయినా యీమధ్య పొంగరాలాటలో బడ బొత్తిగా పోగం

దానిల్లు మరచిపోయినట్లున్నారు. అబ్బా రండి!" అని ఒక కొంటె చూపు చూచింది. బాటదప్పిన బాలచంద్రుడు ప్రియురాలివెంట మెట్లెక్కిపోయి మేడలోని పట్టు పరుపుమీద పవళించాడు.

వారకాంత వలపులు కురిపించింది. మోహావేశంలో మునిగిపోయిన బాలుడామెకు ఐదువేల వరహాలు సమర్పించి మేడమెట్లు దిగుతూండగనే బ్రాహ్మణులు వచ్చి దీవించారు...యాచకు లర్థించారు. వారిని సత్కరించడానికి చేతిలో చిల్లిగవ్వయు లేని బాలచంద్రుడు తనకై కాచుకొనియున్న చెలికాండ్రను చేరబిలిచి యీ బ్రాహ్మణులకు యాచకులకు నేదేని నీయుడని చెప్పాడు. కానీ స్నేహితులందరూ మా చెంతనేమియు లేదని చేతులు వెల్లవలచైచారు. అది చూచి అనుపోతుకు కోపం వచ్చింది. "ఏమి పని చేశావు చంద్రా ! మాయలాడి మమకారంలో ఐడి చేతిలో నున్న సొమ్మంతా సాని కర్పించావా! నీవు చేసింది దానమా ? ధర్మమా ! నీకు కలిగింది పుణ్యమా! పురుషార్థమా ? ఐదువేల వరహాలు బిడ్డల కిచ్చినట్లా? బీదలకిచ్చినట్లా? బంగారముపంటి భార్య చెంతకు సొమ్మని కన్నతల్లి కనికరించి పంపగా దాతిలో యీ దౌర్భాగ్యపు పనియేమి"టని మందలించాడు.

బదులు చెప్పలేకపోయిన బాలచంద్రుడు మొలనున్న బంగారు మొలత్రాడు తీసి వెలది దోర్నడుచేత అమ్మకం చేయించిన ధనం విప్రులకు, యాచకులకు పంచి యిచ్చిన తరువాత గండువారింటికి పోయాడు. అల్లుడు ప్రాతవాడేగాని, ఆగమనం క్రొత్తయింది. ఇంటి యజమాని యుద్ధానికిపోయి యున్నందున అత్తగారే అన్ని మర్యాదలు చేయించారు.

# అత్తవారింటికి వచ్చిన అందాల బాలుడు

బాలచంద్రుడు రత్నకంబళిమీద కూర్చున్నాడు. తియ్యని పండ్లు, తేనె పానకాల విందారగించాడు. కప్పురపు తాంబూలం సేవించి సుగంధ పరిమళ వాయువుల్ని పీలుస్తూ మత్తులో ఒత్తిగిల్లపోతున్నాడు——అభ్యంతర మందిరంలో చెలులంతా మాంచాలను రతీదేవిలా అలంకరించారు.

సౌందర్య దేవతయైన తన భార్యను చూచుకొని బాలచంద్రుడు చకితు డయ్యాడు. సంపెంగనూనెతో తలంటుకొని, పన్నీట స్నానంచేసి, బంగారు జల తారు సరిగించు వలువలు ధరించి వచ్చిన మాంచాలను చూచి మన్మధరాణియని వర్ణింపసాగాడు. "అహా! ఏమా అందం? ఆ చందం అలివేణి తలలోని పూల చెండున కెంత వెలుగొచ్చింది! ఆమె నొసట దిద్దిన తిలక మెంత సుందరముగ నున్నది? ఆ కొప్పుమీద నున్న రాగిడి- ఆ ముక్కునున్న ముత్యాల ముంగిట- ఆ చెవులనున్న సరాలు- ఆ కంఠసీమ యందున్న రత్నహారం - ఆ దండచేతి యందున్న బంగారు కడియం, ఆ ముంజేతులయందు మోహన శ్రుతులు పలుకు తున్న కంకణాలు - ఆ పాదములు నంటియున్న అందియ లెంత పుణ్యము చేసికొన్నవోగదా!" అని అనుకొంటున్న తన్మయంలో తన్ను తాను మరచి పోయాడు.

మాంచాల ముందు శ్యామాంగి అందగత్తె కాదనిపించింది. ఇంతకాలం నేనీ సుందరాంగిని కన్నెత్తి చూడనైనా చూడక యెంత పొరపాటు చేశానను కున్నాడు బాలచంద్రుడు. మరికొంత సేపటికి మాంచాల వచ్చి పన్నీట పతిపాదాలు కడిగి గౌరవించాక మరొక శృంగార మందిరంలోని కాహ్వానించింది. హంస

తూలికాతల్పంమీద కూర్చున్న బాలచంద్రుడు మాంచాల అందించిన తాంబూలం సేవించాడు. ఆయన మనసులో ఏవేవో మధురభావాల తరంగాలుగా పెల్లుబికి వస్తున్నాయి. అది గమనించిన మాంచాల తల్లి చెంతకుపోయి "అమ్మా రాక రాక యిన్నాళ్ళకు వచ్చారు మీ యల్లుడుగారు. నేనీనాటికి వారిని చూచి సేవింపకలిగానే కాని నా జీవితాన్ని ఆనందమయం చేసుకోలేకపోతున్నాము. నాకిపుడు కర్తవ్యమేమి"టని అడిగింది.

రేఖాంబ కుమార్తెను బుజ్జగించుతూ "నిజమే తల్లీ, నీ దురదృష్టాన్ని తలంచుకొని నేను మీ నాన్నగారు పడుతూన్న బాధ నీకు తెలియదనుకుంటాను ! ఏదేమైన నీ విపుడు చేయతగిన త్యాగం కష్టతరమయింది. అమ్మా ! ఈ ప్రపంచంలో మానవులకు కావలసినవి ఒకటి భోగం రెండు త్యాగం శాశ్వతమయింది కూడాను. ఐతే దానిని సాధించడం కష్టమైనవి. నీ పెనిమిటి యిపుడు రణరంగంలో ప్రవేశింప బోతున్నాడు. యుద్ధానికి పోయే భర్తనాపడం వీరపత్ని లక్షణంకాదు. పతికి రణభీరుడను పేరు రారానిది. సంగ్రామము సేయబోవు పురుషునకు స్త్రీ పొందు తగదని పెద్దల నిర్ణయంబగుటచే నీవాతని కపకారం చేసిన దానవయ్యెదవు. అదీగాక సమరమున లభింపనున్నది విజయమో—వీర స్వర్గమో నిర్ణయింపగలవారెవ్వరును లేరు. దైవమనుకూలింపక బాలుడంతరించిన యెడల నీవిక ముందు సుఖపెంపగల దేదియును లేదు. కావున నీ కర్తవ్యమును గురించి నేనెటూ చెప్పలేకపోతున్నా"నంటూ కంటతడి పెట్టుకుంది.

తల్లి తనతో చెప్పలేక తటపటాయించుచున్న దెందుకో గ్రహించిన మాంచాల అర్థం చేసుకున్నానమ్మా ! ఇంతకాలం అడవిన గాచిన పండు వెన్నెలలా గడిచిపోయిన నా జీవితం యీ యొక్కరేయి యొందిలిపడి మాత్రమేమి ప్రయోజనం? ఏడేండ్ల నాటివలెనే నా భర్త యీనాడు కూడా నా యింటికి రాకుండానే యుద్ధానికి పోయారనుకుంటా"నంటూ బాలచంద్రుని యొద్దకు పోయింది.

యుద్ధం మాట పూర్తిగా మరచిపోయి మోహంలో బడిన బాలచంద్రుని మనసు నింతకుముందే గుర్తించిన మాంచాల మంచి మాటలతో పాటలతో ఆటలతో రేయంతా గడిపింది అంతలో తెలవారిందని కోళ్ళు కొక్కురొకో యని కూసినై. అంతవరకు ఓపికపట్టిన బాలచంద్రుని అనుచరులు గండువారింటి ముందుకువచ్చి చప్పుడు చేశారు. అంతటను బాలుడు మేడదిగి రానందున వారంతా కత్తులు దూసి గట్టిగా యరిచారు. అది చూచి అంతఃపురాంగనలు భయపడ్డారు. మంచాలమీది మమకారంతో పోరుమాట పూర్తిగా మరచిపోయిన బాలచంద్రుడు వాకిట నున్న వారు తమ్ములన్న యోచనయు లేక కరవాలం దూసి తమ్ములమీద తారసిల్లాడు.

# మాంచాల దీవెనలు పొందిన మంత్రి కుమారుడు

ప్రతాపంచూపి పరుగెత్తివచ్చిన బాలచంద్రుని చూచినంతనే సోదరులంతా పక పకా నవ్వి "చంపవలసిన వైరులంతా కారెమపూడి యొద్దనుంటే-నీ విక్కడ గండు వారింటిముందు మాంచాల చూస్తూండగా తమ్ములమీద తారసిల్లితివా! భలే యోధుడవయ్యా బాలచంద్రా! అలరాజు చనిపోయినపుడు మీ తండ్రి కొమ్మరాజున కిచ్చిన వాగ్దానం మరచిపోయావు-నీవు చేసిన ప్రతిజ్ఞ నిరుపయోగం కావలసిందేనా? ప్రతిన చేసినంతటనే ప్రయోజకుడవు కావు- ప్రతిన చెల్లించినపుడు సమర్థుడవు. మలిదేవ మహారాజు నీకు భేతాళ ఖడ్గము—కాలిపెండెరములు పంపియున్నాడు. యుద్ధరంగం పిలుస్తూంది. రాగలిగితే గడపదాటి కదనరంగానికి రా! నీవు రాకపోతే మేమే పోయి మావంతు మేము చేసి వస్తా"మన్నారు. ఆ మాటలు విన్న బాల చంద్రుడు లజ్జపడి తిరిగి మాంచాల చెంతకు పోయాడు.

మంచాల వెనువెంటనే మగనికి కర్పూరహారతి నిచ్చింది. వీర కర్పూర తిలకం మోమున దిద్దింది "కదనరంగంలో మీ కెదురు లేకపోవుగాక-గరుత్మంతుని బలం-వాయుదేవుని తీవ్రం-సూర్యదేవుని ప్రతాపం—శ్రీకృష్ణుని కీర్తి కలిగి శత్రువులను జయించెదరుగాక" అని దీవించి వీరఖడ్గం చేతికందించి వీడ్కోలు చెప్పింది.

బాలచంద్రుడంతట తల్లియొద్దకు వచ్చి చక్కగా స్నానంచేసి భోజనాంతరమును తల్లిదీవెనలు పొంది తమ్ములతో గూడా వీరమేడపినుండి బయలుదేరి త్రిపురాంతకం చేరినాక ఒక రావిచెట్టుక్రింద కూర్చున్నాడు. అనపోతు చెంతలేని సమయంచూచి మిగిలినవారితో "తమ్ములారా! మీకొక రహస్యం చెబుతున్నాను. మనలోని అనుపోతు బ్రాహ్మణుడు, ఆయన కూడా మనతోబాటు యుద్ధానికి వస్తున్నాడు. రణరంగంలో చావో బ్రతుకో తెలియదు. బ్రాహ్మణ హత్యాపాతకం మన కాపాదింపరాదని యింటియొద్ద నాకు మీ వదిన చెప్పింది. అందుగురించి మనమిపుడీ అనుపోతును వెనుకకు పంపే ఉపాయం చేయాలి.

"నేను నా ముత్యాల కంఠమాల ముద్దుటుంగరం మాంచాల మందిరంలో మరచిపోయాను. నీవు పోయి మీ వదిననడిగి తీసుకొనిర"మ్మని అనపోతు వింటూండగా మీకు చెప్తాను. అపుడు మీరంతా యెవరికివారే యేవో సాకులు చెప్పి మేము వెనుకకు పోమని చెప్పంతి. అంతట నేనాతనికి పురమాయించి తిరిగి వీరమేడపికి పంపిన తరువాత మనమిటు ముందుకు సాగిపోవుద"మని చెప్పాడు. వారంతా సరే నంటే సరేనన్నారు.

ఇంతలో అనపోతు వచ్చి వారిని కలుసుకున్నాడు. బాలచంద్రుడు తన కప్పటికప్పుడే గుర్తొచ్చినట్లు నటించి "నేనా గండువారింట నా ముత్యాల కంఠమాల, ముద్దుటుంగరం మరచిపోయి వచ్చాను. యుద్ధానికి బయలుదేరిన నేను వెనుకకు పోవడం మంచిదికాదు. మీలో ఎవరైనాపోయి మీ వదిననడిగి తీసుకొని

రం"దని ముందుగా తమ్ముళ్లార్వురను పేరు పేరున పిలిచి చెప్పాడు. వారంతా తగిన సాకులుచెప్పి యీ పని మాదికాదని తప్పుకున్నారు.

బాలుండంతట అనుపోతుతో "తమ్ముడూ! ఇక ఈ పని నీకు తప్పదయ్యా అదేగాక మంచాల దగ్గర నీకున్న చనువు వీరిలో యెవరికిని లేదు. వీరు నిజముగా నా తమ్ములలోని వారేనని గండువారమ్మాయి పోల్చుకొనలేక పోవచ్చును కూడా. నీ వందునా నా వెంటనుండి మీ వదినకు పరిచయమైనవాడవు. శుద్ధచాందస బ్రాహ్మణుండ వగుట నీ వబద్ధమాడవనియు నమ్మవచ్చును. కావున నీవు త్వరితంబుగా పోయిరావలయు"నని మొగమాట పెట్టాడు. అనపోతింక కాదనలేక నేను తిరిగి వచ్చేవరకూ మీరిందే ఉండవలయునని చెప్పి తన గుర్రమునెక్కి వీరమేడపికి తిరిగి వెళ్ళాడు.

# ముత్యాల హారము-ముద్దు టుంగరము

అనుపోతును వెనుక కంపిన బాలచంద్రుడు ఆకుమీద ఘంటంతో "తమ్ముడూ! పోతూ! నీవు బ్రాహ్మణ బాలుండవు. సమరమున సమయుదు వేని మాకు బ్రహ్మహత్యా పాపమంటగల"దను తలంపున మాంచాల నాకు "నిన్ను రణరంగమునకు గొనిపోవల"దని చెప్పింది. ఆ కారణంగా నీకు నేనబద్ధం చెప్పి వెనుకకు పంపాను. నా మాటయందు గౌరవముంటే నీవీ త్రిపురాంతకం దాటి ముందుకు రావొద్దని అన్నగా నిన్నాజ్ఞాపించుచున్నాను. నా మాట మీరితివేని శ్రీశైల మల్లికార్జున స్వామి మీదాన-చెన్నకేశవ స్వామిమీదాన-బ్రహ్మనాయుని మీదాన—మలిదేవుని మీదాన—నా మీదాన" అని వ్రాసి వారు కూర్చుండిన రావి చెట్టుకొమ్మకు గట్టిన తరువాత అనుజుల వెంటబెట్టుకొని ముందుకిపోయి నలగొండ నెక్కి దిక్కుల కలియజూచాడు.

ఎక్కడ చూచినా యెడతెరిపిలేని సేనలతో కారెమపూడి మైదానమంతా కదనభూమి కాబోతూంది. సైనికులు నివసించే గుడారాలు- ప్రభువులకు ప్రధానోద్యోగులకు, పరివారాలకు తగిన తాత్కాలిక భవనాలు, వంటచేసే పాకలు-ఆయుధాలను భద్రపరచే శాలలు-ఆహార పదార్థాలు నిల్వలు చేసిన గిడ్డంగులు-వైద్య శిబిరాలే కాకుండా గజశాలలు, అశ్వశాలలతో కదనభూమి కోలాహలంగా వున్నది.

ఆ రణగౌణ ధ్వనులు వినడంతో బాలుని కావేశ ముప్పొంగింది. వెలమ దోర్నుని పిలిచి "ఈ శిబిరంబులెవరివో వీని హద్దులేవో-చెప్పగలవా!" అన్నాడు. వెలమ దోర్నడంతట "అన్నా! నలగాముని సేనలు నాలుగు చెరగుల నిండియున్నవి. నేల యీనినట్లున్న ఈ జనంమీద యిసుక చల్లినను క్రిందపడడము లేకున్నది. గురిజాల సేనల కెల్లలు చూచితివా! తూర్పుదిక్కువ జువ్వల కల్లు సన్నెగండ్ల గ్రామముల దాకుచున్నవి. దక్షిణపు దిక్కున నాగులేటికి తూర్పు నలకొండయు వప్పిచర్ల పురముల నాక్రమించినది. పడమర దిక్కున కొదమగుండ్ల చింతపల్లి వాడనంటుచున్నది. ఉత్తరపు దిక్కున జన్నిదేవగుళ్ళు సవనాల మేడ వంగతోటబైలు సింగభూపతి చెరువు సంగడిగుళ్ళు ఉత్తరేశునిగుళ్ళు ఉయ్యాల కంబముల దాకి- కలజువ్వి చుట్టి నలగొండ నొరసి నాగులేరు నంటుచున్నవి.

అంతియేకాదు-ఈ సేనల నాయకత్వముల వహించిన వారెవరో చూచితివా? తూర్పున నాయకురాలు నాగమ్మ కాచియున్నది. దక్షిణమున అందెలరాముడు, నెమలిపురి ముమ్మిడిరెడ్డి పొందగలిగిన భూపాలకుడైన వీరమల్లులు వేచియున్నారు.

ఉత్తరమున నరసింగరాజు పొంచియున్నాడు. పడమర పౌజుల బ్రహ్మనంగోజి గణపతులు నిలిచియున్నారు.

ఇక మనవారైన మలిదేవుని శిబిరంబులను తిలకింపుము. అందరును వీరాధివీరులే. మన పరివారమునందలి ప్రతియొక్క వీరుడును శత్రుసైన్యములమీదబడి

లక్షమందిని చంపగల బలవంతులు. ఆలమందల జొచ్చి చితకు పరచు సింహపు పిల్లలట్లు నలగామునిసేనల మొనరింప తొందరపడుచున్నా"రని నంతనే బాలుడు "తమ్ముడూ ! నా రాకకై రాజెదురు చూచుచుండెనేమొ-త్వరితముగా పోవుదము పద" అంటూ కొండదిగి సైనికుల నడుమ దారి చేసుకుంటూ పోయి మాచర్ల రాజుల శిబిరాల చేరుకున్నాడు.

# మలిదేవుని సందర్శించిన బాలచంద్రుడు

అదే సమయమున రాజసభలో రాయబార చర్చలే జరుగుచున్నవి. కారెమపూడి చేరియుద్ధరంగంలో శిబిరములు వేయించిన నలగామరాజు కొదమగుండ్లపౌరుల కిచ్చినమాట మరచిపోక తన పరివార మందాంతరంగికులను పిలిచి మనమిప్పుడు బ్రహ్మనాయునకు సంధి యేమని చెప్పి పంపుద"మని ప్రశ్నించాడు.

అందుకు సమాధానముగా నాగమ్మ "రాజా ! బ్రహ్మనాయుడు చేసిన ప్రభావం వలన కొమ్మరాజు మొదలైన వారి హృదయాలలో అలరాజును చంపింది నరసింగరాజేనను నమ్మకం నాటుకుపోయింది. వారంతా నరసింగరాజు తల నరికి ప్రతీకారం చెల్లించుకోవాలనే పట్టుదలతోనున్నారు. దానికి మనమంగీకరింపము కనుక సంధి కుదరదని నిర్ణయించి చెప్పింది.

నరసింగరాజంతట "అన్నయ్యా ! నా మరణంతో సమరం నిలిచి పోతుయే బాగుంటే నేను తప్పకుండ పగవారికి పట్టుబడడానికి సర్వసిద్ధంగానున్నా"నన్నాడు జంకుగొంకులు లేకుండా. ఆశ్చర్య మొందిన నాగమ్మ వెంటనే "నరసింగరాజా ! నాగమ్మ యాజమాన్యంలో నిర్దోషులు శిక్షింపబడరాదు. ఆదర్శనీయమైన నీ నీతి నిజాయితీలు తెలియకనా నీయట్టి మహోత్తమ బుద్ధిశాలిని పగవారికి పట్టి

యీయడము ? మీరిట్లు మాటాడ తగ"దని మందలించింది. నలగామరాజు గూడ "తమ్ముడూ ! నీ యన్న నీవనుకున్నంత నీచస్థాయికి దిగజారి పోలేదయ్యా ! ఒక వేళ నీకు మరణదండనే విధింపవలసివచ్చిన యెడల ఆ సాహసము నేనే చేయుట యందు కొంత న్యాయముండునేమొ కాని యింకొకరిచేత చేయించుటకన్న నీచ కారణమేముం"దన్నాడు.

తిరిగి నరసింగరాజు "ప్రభూ ! నేనిది మనసారా చేసిన నిర్ణయం. మీరాలోచింపదగినదనియు లేదు. ఇపుడు కావలసినది నా న్యాయవర్తనము కాదు. ఈ యుద్ధంలో కొన్ని లక్షలమంది ప్రజలాహుతి కాబోతున్నారు. నేనొక్కండనే చని పోయి యుద్ధమాపుదల చేయించిన యెడల వీరందరూ కొంతకాల మీ భూమిమీద బ్రతికి యుండగలరు. ఎందరో తల్లులకు పుత్రశోకము లేకుండగను ఎందరో యిల్లాండ్రకు వైధవ్యము రాకుండగను ఎందరో బిడ్డలను తండ్రిలేనివారు కాకుండ గను చేసినవాడనయ్యేదను. కావున నన్నా విరోధులెన్ని నరకయాతనలు బెట్టి చంపి నను సమ్మతమేనని యిందులకు నాకై నేను ముందుకు వచ్చాను. కనుక "మీరు యుద్ధం విరమించుకునే పక్షంలో నేను నా తమ్ముని త్యాగం చేయగల"నని చెప్పి రాయబారం పంపండి" అన్నాడు.

నలగాముడింక మాటాడలేదు.

నాగమ్మ దూరమాలోచించింది. నరసింగరాజు మహాశయానికి జోహారులర్పించింది. నలగామరాజు ధర్మ సంకటాన్ని గమనించింది. ప్రభూ ! భయమెందుకు మలిదేవాదులకు కావలసింది యుద్ధంగాని నరసింగరాజు కాదు. కాకపోయినా "అలరాజును చంపిన నరసింగరాజంతము చూడా"లన్నదొక సాకుమాత్రమే. నరసింగరాజు పేరడ్డము పెట్టుకొని యుద్ధమున కెత్తివచ్చిన యెడల సంధికంగీకరింపరు కాని యెడ నంగీకరించెదరు. అదియు చూచెదము గాక" అని కొంత అన్నమరాజుల కోట కేతుడు, మాడుగుల వీరారెడ్డి, చింతపల్లి రెడ్డి యను ప్రజ్ఞావంతులైన వారికి చెప్ప దగిన మాటలు చెప్పి మలిదేవుని చెంతకు రాయబారం పంపించింది.

# యువక సోదరుల యుద్ధోన్మాదము

రాజదర్శనము కోరిన నలగామ దూతలకు మలిదేవుడు తగిన మర్యాదలు చేసి కూర్చుండ నియమించిన తరువాత "మీరు వచ్చిన పనేమిటి ?" అని అడిగాడు. రాయబారులు వినయంగా "రాజా ! ఉభయులకును యుద్ధము క్షేమముకాదు. గడిచిన దానిని తవ్వుకొనుటయు మంచిదికాదు. మీరు కోరిన విధముగ నరసింగ భూపతిని మీరు దండింతురా ? ప్రశ్నింతురా ! అను ప్రశ్న లేకుండా మీ కప్పగించుటకును, మాదర్ల మీకిచ్చుటకు గూడ గురిజాలవారు సిద్ధముగనున్నారు. మీరు సంధి కుదిరించి దేశమున శాంతిభద్రతను కాపాడవలయు నని మా విన్నపము.

మీకు తెలియని ధర్మములు లేవు. పూర్వము బహు ప్రయాసలబడి కౌరవులను చంపిన పాండవులు పట్టముకట్టుకొని సుఖపడినదేమున్నది ? బంధునాశనము గురించి వాపోయిరికారా ! మీలో నెవరంతమొందినను అనుగురాజు సంతానమేనను మాటను గుర్తుంచుకొని సంధి యొనరించుటయే మంచి"దని వివరించారు.

ఆ మాటలు విన్నవారందరు "సందేశము న్యాయసమ్మతమయింది. సంధి కుదరటమే మంచిదనుకొనే సమయంలో బాలచంద్రుడు రానేవచ్చాడు. అతనిని చూచినంతనే సభలోనివారంతా యిక సంధి కుదరదని నిశ్చయించుకున్నారు. వారిలో నెవరును బాలచంద్రుని గౌరవించి బాటనీయలేదు. బాలచంద్రుని రోషం పెరిగిపోయింది. ప్రక్కవారలను చూడకయే దన్నుకుంటూ దూసుకుపోయి మలిదేవునకు నమస్కరించి "మహారాజా ! మీతో యుద్ధభూమికి రాలేకపోయిన బాలుని నన్ను మన్నింపు"డన్నాడు.

కన్నమదాసంతట మండిపడుచు లేచి "బాలచంద్రా ! ఇక్కడనున్న మా యందఱకన్న నీవేమొ మహారాజుగారి కాత్మీయుడన్నట్లుగ మమ్ముల తన్నుకొనుచు పోవుట కెవరికంటె గొప్పవాడవు ! నీకి యధికార మెవరిచ్చారు ? నీకంత గుండె బలమున్నచో నాతోడ పోరాడరమ్మ. నీయంతు చూస్తా"నంటూ పరవళ్ళు ద్రొక్కడం చూచి బాలచంద్రుడు తొందరపడక "అవునులే నేను సాటివారికి చెప్పకయే సమర మాడ వచ్చితినా_వచ్చినవాడు నిచట చేతులుగట్టుక కూర్చుంటినా ?-కుదురుగా కూర్చుండి సంజ రాయబారము తిలకించుచుంటినా ! రణశూరుడవు నీవుగాక నేనెట్లు య్యేదనులే" అని యెత్తిపొడుపు మాటలాడాడు.

అగ్గిమీద గుగ్గిలమయ్యాడు కన్నముడు "ఓయీ ! అవివేకి ! పిల్లకాకి ! బొంగరాలాటలాడి బుద్ధి చెప్పించుకొని-వేశ్యకొంపకు పోయి విత్తం పోగొట్టుకొని-అత్త వారింటి మర్యాద నంతంత మాత్రముగ ననుభవించి మలిదేవుని దగ్గర మాట దక్కించుకొనవచ్చిన నీవు నన్నెగతాళిచేయు నంతటివాడవా ? బ్రహ్మనాయులవారి యనుమతిలేక భయపడు చుంటిమిగాని కదనరంగమున కత్తిదూయలేకకాదు" అని వేశాడు-ఆవేళపూటితంగానే.

"బ్రహ్మనాయుని యనుమతిలేక భయపడడానికి నీకు బ్రహ్మనాయునికున్న సంబంధమేమిటి ?" అని సూటిగా అడిగాడు బాలచంద్రుడు.

కన్నముడు వెనువెంటనే "పలనాటి శ్రీకృష్ణపరమాత్మ బ్రహ్మనాయుడు, ఆయన రాజకుటుంబానికే రక్షకుడు, ధర్మము మూర్తీభవించిన దైవరూపము, తెప్పలి నాయకుని భార్య పెమ్మసాని, పెమ్మసానియందు నేను బ్రహ్మన్న కరుణతో బుట్టినవాడను. వారి కభిమానపుత్రుడను-భుజములమీద గురుముద్రలు కల్పించు కొనిన గురుతర భక్తుడను. నాన్నగారి పాదసేవకుడ_ఆజ్ఞా పాలకుడను. నేనే బ్రహ్మన్నకున్న పెద్దకుమారుడను_నీవు నా తరువాతవాడ"వంటూ తన గొప్పతన మంతా చెప్పుకున్నాడు.

బాలున కిప్పుడింకొక వీలు దొరికింది. తండ్రికి పెద్దకుమారుడవు నీవైతే, తలదన్ని పుట్టిన తమ్ముడను నేను. అన్న తొడలు ద్రొక్కుటకు తమ్ముని కధికార మున్నది. మలిదేవుల వారిని జేరడానికి మార్గమీయకపోయారు మీరు. తొందరపడి త్రోసికొని వచ్చాను నేను. శత్రుసేనలు సముద్ర తరంగాలుగా పెరుగుతున్నాయి అవి మనమీద విరుచుకుని పడకముందే మనం ముందుగ తొందరపడి పగవారి బల గంబుల పల్చబడచేయడ మవసరమని మీ యందరకు గూడ మనవి చేస్తున్నాను. ఇందులో తప్పంటే నన్ననండి" అన్నాడు. కపటములేని కన్నమదాసు నవ్వుతూ కత్తి నొర యందుంచి తమ్ముని కౌగిలించుకొని యెత్తిదించాడు. వీరావేశమున తార సిల్లిన అన్నదమ్ములిద్దరూ ఆలింగనము చేసుకున్నారు.

# బాలచంద్రుడాడిన పోటు మాటలు

మలిదేవ భూపతిని బ్రహ్మనాయుడు మంత్రియే యైనను మంత్రికన్న మించిన మార్గదర్శకుడయ్యాడు. వీరవిద్యాదేవి కుమారుల్కు కన్నతండ్రి అనుగు రాజును చిన్నతనంలోనే కోల్పోయినందున వారి మంచిచెడ్డలు చూచినవాడు బ్రహ్మనాయుడు గారంటె వారికి నారాయణమూర్తియన్న నమ్మకం. ఈ కన్నమ బాలు లిద్దరూ నాయునికి రెండు కన్నులవంటివాడు. ఆ ముద్దు సోదరులు పంతా లాడు కొనుచుండ నెవరి నేమనవలయునో తెలియని పరిస్థితిలో తికమక పడ్డాడు. కాని వాని కా పని లేకుండానే వారిద్దరూ రాజీపడడం మేలయింది. ఒక విధంగా ఆ అన్నదమ్ముల సంవాదం కొంతమందికి వినవేడుకయింది కూడాను.

యుద్ధభారం తలమీద నుండి కూడా యీ అన్నదమ్ముల వింత వివాదం చూచుచున్న తన్మయంలో నుండి యింకా ఈ ప్రపంచంలోనికి రాలేకపోయాడు

మలిదేవుడు ఆ కాస్తలోనే తొందరపడిన బాలచంద్రుడు "అలరాజును చంపిన వానితల మూడు నెలలలో నరికేయాలని మనమంతా నిర్ణయించుకున్నాం. కాని యిచ్చిన మాచర్లనగరం పరాయివారికి స్వాధీనం చేసి-కుంట కుంటల నీరుత్రాగి ఆకు కూరలు దిన్న పసరు తలకెక్కి కర్తవ్యం తెలియకున్నా"వని రాజదూషణ కుపక్రమించాడు.

బాలుని ఘోరణి పెడత్రోవన బడడం గమనించిన కన్నమనీడు వాని నా మార్గము నుండి మరలింప నెంచినందున వెంటనే జోక్యము కలిగించుకొని "చంద్రా! తొందరపడుచున్నావు. మలిదేవులు మన ప్రభువులన్నమాట మరచి పోరాదిది. రాజ సమక్షమున నుండ సేవకులు కొన్ని పరిధులమీరి సంచరింప రాదు. మన యిచ్చవచ్చినట్లు సంచరింప నెంచిన మొదల రాజేంద్రుని వెంటబెట్టు కొని రారాదు. మలిదేవుని తోడ్కొని యుద్ధమునకు వచ్చుట మొదటితప్పు — త్రిపురాంతకము నందున్న వేల్పు కంబము నందే యుంచి పూజించుటతో విర మింపక దానిని పెకలించుట రెండవతప్పు-కయ్యమునకు కాలు కదిపినపుడే ధరింపవలసిన వీరకంకణములను కొంతదూరం వచ్చినాక కంకణాల పల్లెలో గట్టు కొనుట మూడవతప్పు-వచ్చినవారము వెంటనే కత్తిదూయక పగవారి సేనలు ప్రబలములై వచ్చువరకు నుపేక్షచేయుట నాల్గవతప్పు-నలగాముని పక్షమువాడు రాయబారమునకై వచ్చియుండ వారిముందు మనమిట్లు అనైక్యతతో కలహించుట ఐదవతప్పు, తప్పులన్నియు మన ముందుంచుకొని ధరణీశు లనుటెందులకు ? ఇచ్చ యున్న విచ్చుకత్తి చేబూని యుద్ధమొనరింపుము; మనసొప్పకున్న మరలిపొ"మ్మని నిర్మొహమాటంగ అనేశాడు.

బాలచంద్రుడు డంతటు హుంకరించుచు "మనసొప్పకున్న మరలిపోవుటకే బాలచంద్రుడు భయపడుటలేదు. తూర్పు సూర్యుడు పడమట పొడిచినా - సముద్రములు పొంగి భూతములపై జలప్రళయం కలిగినా-కుల పర్వతములేడును పెఠిల్‌మని పగిలి భూమి దద్దరిల్లినా-మింటి చుక్కలు రాలినా-అగ్ని చల్లారినా బ్రహ్మనాయుని ప్రయత్నం భంగం కానేరదు. నేను బాలుడినైననేమి ? కాలకాలుడనై పగవారి మూకలపట్టి చెండాడక విడిచి పెట్టువాడను కాను-నరసింగుని తలద్రుంచి నాటి శపథం చెల్లింపక చేతులు ముందు బెట్టుకుని కూర్చుండుటకు చేతగాని వాడనుగా"నన్నాడు ధీమాగా.

మామా! కొమ్మరాజా నీ కొడుకును చంపించిన వారితో నీవు సంధి చేయ చూచుచున్నావా ? నీ పౌరుషము చచ్చిపోయినదా ? నీ కత్తి మొక్కవోయినదా ? లేవకుంటివేమి ? కాళిబిగించి, కత్తిఝళిపించి, కదనరంగమున పగర కండల చెండాడక సందేహించుచుంటివేమి ? —బావా నాయుడా ! నాడాడిన పౌరుష వాక్యములను మఱచిపోయితివా ? లేక నిద్రవోవుచుంటివా? కాక, సమరంగమును చూచి పిరికివాడవైతివా? మూడునెలలు గడవు దాటిపోయినా మీలో చలనం కనబడదేమి? మామా ! కన్నమనీడ! మగమీటి లేదటయ్యా నీకు? త్రిపురాంతకము నుండి గొని వచ్చిన కంబమున కిచట తలదంటి పోవుచున్నది. కార్యభారమున కన్ను మూయవచ్చునా! సుందరామా! చెవుల నాయకులారా! జంకి వినాయకులారా ! పెనుమాల వీరులారా! సొంపేట నారన్నా? మీరంతా యేమి చేయుచున్నారు? శత్రు సేనల మీద సాహసించి యీ యుద్ధంలో మొట్టమొదటిసారిగా యెదుటి వారిని పొడిచిన తొలిపోటు నాదని చెప్పుకొన గల వారెవరును లేరా!" అని సైనికుల సమ

రోత్సాహమును కలిగించుచుండ బ్రహ్మన్న లేచి కుమారుని సమాధాన పరచి కూర్చుండ నియమించాడు.

## అనపోతు పంపించిన ఆనవాలు

కొమ్మరాజు బాలచంద్రుని సమీపించి భుజముమీద చేయివైచి "చిరంజీవీ ! నీవనుకొనునట్లే కాగలదు. కాని, తొందరపడక నా మాట లాలకింపుము. కుమారుని కోలుపోయిన నాకు కుదురుబాటు కూడానా? నిజము చెప్పవలెయునంటే అలరాజు మరణవార్త విన్ననాడే నేను నిన్నలరాజు స్థానంలో చూచుకొని ఊరటచెందాను. చూడు నాయనా ! యుద్ధానికి వచ్చిన శత్రువులు భయపడ్డారు. రాజపౌరుషం కోల్పోయినారు. పరువు మర్యాదల నొదులుకున్నారు. తమ్మునిగూడ మన కప్ప గించుతా మన్నారు. క్షత్రియుల కంతకన్న నవమానకరమైన దేమున్నది ?

పరమశత్రువైనను పాదాక్రాంతుడైనపుడు ప్రాణములు దీయుట పాప కరము. సంధిపడి నంతమాత్రమున శౌర్యహీనులము కాజాలము. అలరాజును చంపించినది ఒక నరసింగరాజు-అతనికి తోడైన నాగమ్మ లిద్దరే కదా! ఇరువురిమీద పగసాధించుట కిన్ని లక్షలమంది ప్రాణములను మనము తీయుట న్యాయమా ! అందుకని మహారాజావారు- మీ నాన్నగారు సంధికామోదించుట మంచిదనుచుండిరే కాని సమరమూడలేక కా"దనినంత బాలచంద్రుడును బదులాడలేకపోయాడు. సంధి కుదిరి నట్లేనను నిర్ణయమునకు వచ్చిన వీరులంతా యిక యెటువారటు వెనుకకు తిరిగిపోవుదమనుకొనుటచే భోజనములు సేయుటకు కూర్చున్నారు.

వారందరును అన్నములు కలిపి తొలిముద్దలు నోటబెట్టబోవు సమయాన మేడపినుండి వచ్చిన మాడచి యొక చిన్నపెట్టి బాలుని చేతి కందించింది. బాలు డాతురతతో దానిని తెరచిచూచాడు. అందులో నెత్తుట తడిసిన జందెమున్నది. అది తన ప్రియమిత్రుడైన అనుపోతు జందెం. దానిని చూచినంతనే బాలచంద్రు నిలో సేయుమాని బాలునివంక చూచారు.

త్రిపురాంతకం నుండి వెనుకకు పంపబడిన అనపోతు సరాసరి వీరమేడపికి పోయి మాంచాలను సమీపించినంత నా గుండువారమ్మాయి వానిని కూర్చుండ నియమించి తగు మర్యాదలు చేయించింది. అనపోతంతట "వదినగారూ! కూర్చుండ నాకు తీరికలేదు. బాలవీరులు త్రిపురాంతకం దగ్గరున్నారు ముత్యాలహారం ముద్దుటుంగరం మా అన్నగారిచట మరచిపోయినారట. వానిని మిమ్మడిగి తీసికొని రమ్మని బాలుడు నన్ను నియమించియున్నాడు. త్వరితముగ యిచ్చిపంపు" మనిన మాంచాల ప్రశాంతముగ మరిదీ! మీ యన్నగారిచట మరచిపోయినదేమియును లేదు. మీ యన్న నీకీ మాయమాటలు చెప్పిన మర్మమేదియొ తెలిసికొనవయ్యా" అన్నది.

అయోమయ స్థితిలో పడిపోయాడు అనపోతు. మంచి ముత్యాల హారమీయ దానికి మాంచాల తన్ను నమ్మలేదేమో ననుకొనిసందున తిరిగి "వదినమ్మగారూ! నేను బ్రాహ్మణుండను, అబద్ధమాడను. అంతఃపురమున పోయిన [illegible] వెనుకకు

తిరిగి రాకూడదని సన్నిపత్తికి నియమించాడు. వారంతా నా రాకకై వేచియుందురు. కావున నేనింకాలశ్యము సేయరాదు. ఒకప్పుడు నేనబద్ధమాడి ముత్యాలమాల ముద్దు టుంగరంబుల నపహరించాననే యనుకో-అప్పుడు బ్రాహ్మణున కిచ్చాననియైన తృప్తిపడవచ్చును. కావున సందేహింపక వానిని నాకిచ్చి పంపించు"మని యడిగాడు.

ఆ మాటలకు చిరునవ్వు నవ్విన మాంచాల "అయ్యా! నీవు బ్రాహ్మణుండవు కనుకనే నిన్ను మీయన్న యుద్ధమునకు గొనిపోక వెనుకకు పంపినాడు. యుద్ధములో గెలుచువారెవరో-చచ్చువారెవరో మనం చెప్పలేము. ఒకవేళ నీవు మరణించెదవేని బ్రాహ్మణహత్యా దోషమాపాదించునను భయమున నీవు నూరేండ్ల పాటు జీవించి యుండవలయునను తలంపున నీకి మాయమాటలు చెప్పినారే కాని వారి వస్తువులిందేమియును మరచిపోలేదు నేను నీకు నిజము విప్పి చెప్పితిని. నీవింక యీ వీరమేడపిలో సుఖంగా జీవించుచుండు"మని చెప్పింది.

అంతట అనపోతు మనిసు వికలమైపోయింది.

సరాసరి త్రిపురాంతకం పోయి బాలచంద్రుని కలిసికోవాలనుకున్నాడు. కాని, అంతలో వాని మనసున కింకొక ఆలోచన కలిగింది. "నేనందాకా పోయి మాంచాల మందిరాన నీవు చెప్పిన వస్తువులు లేవని చెప్పగానే బాలచంద్రుడు జాడ గరచి పోను సుమా పొరపాటు జరిగింది. నేను వానిని మరచింది మాంచాల మందిరంలో కాదు-శ్యామాంగి సౌధంలో మరచిపోయాను. మళ్ళిపోయి రమ్మంటాడేమో ననే అనుమానం వచ్చింది. అందుకని అనుపోతు తిరిగి శ్యామాంగి దగ్గరకుపోయి "మాయన్న బాలచంద్రుడు మీ యింట ముత్యాలమాల ముద్దుటుంగరం మరచిపోయినారట-వానినడిగి యిప్పించుక రమ్మన్నా"డని యడిగాడు.

శ్యామాంగి వకపకానవ్వి "మంత్రిగారబ్బాయి మా యింట్లో మరచి పోయిందేమీలేదు. మీరు వెంటనే దయచేయండి మా కింటిలో పనియున్న" దంటూ తలుపులు బిగించుకొని వెళ్ళిపోయింది.

అనుపోతు కది తీరని యవమానంగా తోచింది. వెనువెంటనే తిరిగి త్రిపు రాంతకం పోయి చూచాడు. అక్కడ బాలచంద్రుడుగాని - వాని అనుచరులుగాని కనబడలేదు. వాని గుండె గుభేలుమన్నది. మాంచాల చెప్పిన మాటలు నిజములా అనిపించింది. అటు యిటు చూచాడు. రావిచెట్టు కొమ్మను గట్టివున్న ఉత్తరం చూచి చదివాడు. ఆయనకు తల తిరిగిపోయింది ఎన్ని పర్యాయములు చదివినా అవే మాటలు "అన్నయ్యా!" అని ఒక్కసారి బిగ్గరగా కేకవైచి కూలబడ్డాడు.

## తినబోవు ముద్దలు తీర్థమాయెపాలు

బాలచంద్రా- నీ వింతపని చేస్తావనుకోలేదయ్యా? తోబుట్టిన తమ్ముని లాగా నిన్నెడబాయక తిరిగినానె గురిజాల వీరుల గుండెలు చీల్చిచెండాడి వీరబిరుదంబు హొందవేడుకబడివచ్చినానె- బాలచంద్రుని ప్రక్కన ఖండన భూమిలో వీరవిహారం చేయాలనుకొంటినె? నాకా యవకాశం లేకుండ చేశావెందుకు? నా శౌర్యం నీవెఱుగవా? నా స్వాంతము నీకు తెలియదా! నమ్మించినట్లు మోసం చేయడం నీకు న్యాయమా?

ఆయువుచాలక నేను యుద్ధమున చనిపోయిన నాడు బ్రహ్మహత్యాపాతకం సంభవించుననను భయముననే యిట్లు చేసితివా? నీవేమి నన్ను పోరాటమునకు మొగమాట పెట్టితివా? లేదుగదా! నా బుద్ధిపూర్వకముగ నేను ప్రవేశించినపుడు ఫలా ఫలములకు నీవెట్లు బాధ్యుడవయ్యెదవు? నేను మరణించిన నీకు విప్రకుమార హత్యా పాతకమేల సంభవించును?

నేనారువేల నియోగి బ్రాహ్మణుండను. మా యింటిపేరు ఒడ్డేవారు. ఒరిస్సా ప్రాంతీయులమగుట ఓండ్ర శబ్దమునుండి కలిగినదే ఒడ్డేనామము. ఆనాటి మా తాత పెద్దనాన్నగారు నాకు యుద్ధమున ప్రఖ్యాతిగన్న వీరశేఖరులై యుండ నన్నెంత రణభీరునిగా నెంచితివయ్యా! మల్లమాంబ మల్లపరాజుల కుమారునకా తాతగారి పేరు దక్కుటయు నీకిష్టము లేకపోయినదా!

భారతయుద్ధంలో కౌరవుల పక్షమున మహాసైన్యాధిపతి పదవివహించి పద్మ వ్యూహము పన్నిన ద్రోణాచార్యుడు మా బ్రాహ్మణుడుకాడా? ఆ ద్రోణునకు బావ మరదియై కురుపాండవులకు కులగురువులైన కృపాచార్యుడు మా బ్రాహ్మణుడు కాడా! వారందరును యుద్ధమున నిలువంబడినపుడు బ్రాహ్మణహత్యాపాతకంబు కల్గునని వారెవరికిని గలుగని భయము నీకేల వచ్చినది? అదియునుగాక సత్యసంధుడని, ధర్మశీలుడని పేరుహొందిన ధర్మరాజంతవాడె తనపని నెరవేర్చు కొనదలంచి పచ్చియబద్ధమునాడి పూజ్య గురుదేవుడు పవిత్ర బ్రాహ్మణుడు నైన ద్రోణాచార్యుల వారికి తీరని యపకారం చేసిన మాటయైన నీ మనస్సుకు వచ్చి యుండలేదా?

నీ పురాణానుభవ మేమయింది ? నీ సోదరాభిమాన మేమయింది? నన్ను యుద్ధానికి రావలదని సందేశము మాత్రమే కాకుండా నాకానలు బెట్టి బంధించితివి. కది యేమి న్యాయము ? నీవు పెట్టిన యానలు మీరి నేనిపుడు యుద్ధమునకు రావలయునా! మానవలయునా! ఒక విధంబున చావునకు భయపడి నేటి యుద్ధమునకు రాకనుందునే యనుకొనుము. ముందొకనాటికైన మరణము తప్పునదియా? నీవనినట్లు రణరంగమున జయాపజయములు దైవాధీనములు. నీకే మరణము సంభవించిన యెడల జీవించి మాత్రమేమి ప్రయోజనము? అయ్యయ్యో అంత మాటయే ? చెన్నకేశవుని దయవలన నీవు మరణింపరాదు. నిజముగా నీవు మరణింపరాదు. నిజముగా నీవు యుద్ధమున విజయము పొంది తిరిగి వచ్చిన పిదప నేనేపాటి వీరుండని సిగ్గులేక నీ మొగము చూచి మాటాడగలనా? ఎటు చూచినను నేనిపుడు చనిపోవుటయే మంచిదనిపించుచున్నది.

"చచ్చి స్వర్గమున నున్న మన బావ అలరాజు దగ్గరకు మీకన్న నేనే ముందు పోవుచున్నా"నంటూ పిడిబాకు డొక్కలో పొడుచుకున్నాడు. రక్తం ద్రవించింది. కన్నులు తేలిపోవుచున్న సమయంబున ప్రక్కన నిలవంబడి ఉన్న మాడచి పలుకరించి "ఎవరు! అనపోతువా! అయ్యో! బ్రాహ్మణ కుమారా! నిన్నీ రూపంలో చూస్తానని నేననుకోలేదు. ఎవరీ ఘోర కృత్యం చేశా"రని అడిగింది. అనపోతు మాడచితో "మాడచీ సమయానికి వచ్చావు తల్లీ! మేడపినుండి కారెము పూడి పోవుచున్నట్లున్నావు. నన్నెవరేమీ చేయలేదు. నేనే స్వయంగా కత్తితో పొడుచుకున్నాను. ఆ కారణం బాలచంద్రునికి తెలియును. ఇదిగో నీవీ యాన వాలును గొనిపోయి బాలుని కందించి పుణ్యము గట్టుకొ"మ్మంటూ మెడలోని

జందెం తీసి నెత్తుట తడిపి దీనిని పిండిన రక్తంతో బాలుని నొసట వీరతిలకం బెట్టుమని చెప్పుతూ ప్రాణాలు విడిచాడు.

మాడచి వెంటనే వీరమేడిపినుండి అనపోతు తల్లిదండ్రులను రావించి కుమారుని మృతకళేబరమును దహనక్రియలకు నియమించిన తరువాత నాథుడిచ్చిన జందెము నొకచిన్న పెట్టి యందుంచుకొని పోయి కారెమపూడి యందున్న బాలుని చేతి కందించింది. జరిగినదంతా తెలుసుకొనిన బాలచంద్రుడిక ముద్ద నోట బెట్టలేకపోయాడు. వెనువెంటనే లేచి తన ముందున్న యన్నమును గంగాధర మడుగున గలుపుట చూచిన తోటివారంతా బాలచంద్రు ననుసరించారు. బాలచంద్రుడంతట ఎలుగెత్తి "సంధి జరుగదు, సమరమాగ"దని కేకలు పెట్టాడు. రణయోధులంతా కత్తులు దూశారు. రణభేరి మ్రోగింది.

# సంధి కుదరని సంగ్రామము

బాలచంద్రుని యుత్తేజమమంతకంతకు నినుమడించుచున్నది. మీరింకను సమరమునకు సందేహించు చున్నటులున్నారేమి? నేనుండగ మీకేమి భయము? నేనన నెవరు ననుకొనుచు చుంటిరి? అలనాడు అయోధ్యాపురాధీశ్వరుడైన హరిచంద్ర ధరణీశు నందనుండగు లోహితాశ్యుడను, నేను రాక్షస రాజేంద్రుడైన హిరణ్యకశిపునకు ప్రియకుమారుడనగు ప్రహ్లాదుడను, నేను- శివకంచిపురమునందు కీర్తి

నొందిన చిరుతొండనంబి కాత్మజుడనగు అంగదండును సిరియాళుడను నేను—కిష్కింధ పాలించిన వానరేశ్వరుండైన వాలి తనయుండనగు అంగదుండను నేను కౌరవుల దునుమాడి కురసామ్రాజ్యము నేలిన యుధిష్ఠిర సోదరుడైన అర్జున సుతుడనగు అభిమన్యుడను నేను, జన్మజన్మల యందు నేను బాలుడనై ఘనకార్యముల సాధింప ఉన్నాడను. ఇపుడీ పల్నాటి కృష్ణావతారమని ప్రఖ్యాతిగన్న బ్రహ్మనాయక మహామాత్యుల వారికి ఐతమ్మయందు జన్మించిన వరపుత్రుడనగు బాలచంద్రుడను నేను ముందుండ మీరు వెనుక ముందాడనేల" అని ధీరోచితంగా తోటివారలను ప్రోత్సహించాడు.

ఆ మాటలాలకించిన వారిలో కొందరు "భళభళీ! బాలచంద్రా! నీ వంతటి వాడవేనయ్యా!" అని మెచ్చుకున్నారు. మరికొందరు యోచనా పరులు లోలోన నవ్వుకొని "రాజా బాలచంద్రా ! ఈ జన్మలో మొన మొన్న నీవు వీరమేడపికి మంత్రివైన బాధ్యతనే మరచిపోయావు, నీ తండ్రి యుద్ధానికి వచ్చిన మాటే నీకు జ్ఞప్తియందు లేకపోయింది. "అమ్మా! మా నాన్నగారెక్కడికి పోయారని అడిగినా వటనె అంద మందమతికి గతించిపోయిన యుగాలనాటి యవతారముల చెప్పగల పూర్వజన్మ జ్ఞానమున్నదా! ఇంత జన్మ సంస్కారం కలవాడవు మాంచాలపట్ల నంత నసభ్యతల ప్రవర్తించెదవా!" అని అనుకుని కూడా "అయినా, యీ దుడుకు తనము గలవానితో మన కెందుకులె"మ్మని సరిపెట్టుకున్నారు.

బ్రహ్మనాయుడు కుమారుని దరిజేర్చుకొని "చెన్నా ! నిన్నా మేడపి యందుంచిరాగ మా వెంటనంటి వచ్చావు—సంధి ప్రయత్నం సాగనీయక పోయావు—సమరమున కందరను సన్నాహ మొనరించుచున్నావు, ఇంతవరకు

వచ్చితివి కావున నింక వెనుకాడవసవసరములేదు. చేసిన ప్రతిజ్ఞలు చెదరనీయకుము. గజఘీంకారములకు, హయహేషణములకు, కాల్బలముల కోలాహలములకు కలవర పాటు చెందితివేని కదనమునందు నిలువజాలవు. పూర్వము మహాభారత సంగ్రామంబున అర్జుననంతటి అతినధికుడే కౌరవసేనల చూచి కంపించిపోయాడు. బ్రహ్మనాయుని పుత్రుడవు-బాలచంద్రుడవైనందులకు కన్నతండ్రి కీర్తికి కళంకము రానీయక సమరం బొనరింపు"మని సందేశమందించాడు.

నాన్నగారూ! నన్ను గురించి మీరేల శంకించెదరు? బాలుడనని భయపడు చుంటిరా? కొదమ సింగపుపిల్ల మదపుటేనుగుల పైకెగసి కుంభస్థలంబుల గూడ చీల్చుట లేదా? బ్రహ్మనాయుని పుత్రునకు ఖండనభూమి భయము కల్గించినా, పగవారి సేనలచూచి పారిపోవుదునా! త్వరితంబుగ మీరు నన్ను తండ్రి దీవెనల నిచ్చిపంపు"డనుచు తలవంచినదే తడవుగ శీలమ్మ కొడుకు చిరునవ్వు నవ్వి శంఖ తీర్థము నిచ్చి "కదనరంగమున నీకు ఘన విజయంబగునుగాక" అను ఆశీర్వ దించాడు.

## రణభూమి కరుదెంచిన నరసింగరాజు

నలగామ భూపతి యాజ్ఞను పొంది, నాగమ్మ సూచనల ననుసరించి, సమర సన్నాహంబున బయలుదేరిన నరసింగరాజు గజారూఢుడై-గణగణ ధ్వనులు మిన్నుముట్టుచుండ కదనభూమికి కదలివచ్చాడు. మహాబలాఢ్యులైన చొక్క జువ్వల వారు, నూరెలవారు, పదివేలమంది మారణాయుధముల ధరించి గజబలానికి ముందు నడచుచుండ-విలుబట్టి యుద్ధమొనరించి నాలుగువేలమంది వీరులు తన్నుమన

రించుచుండ-ఐదు అశ్వికదళం వెన్నంటి వచ్చుచుండ- వివిధాయుధంబుల ధరించిన మంది మార్బలం తండోపతండాలుగా తరలి వచ్చుచుండ-విజయపతాకలు నెగురుచుంత కొనగోటు కోరమీసము దువ్విన నరసింగభూపతి గర్జన పరవీరుల గుండెల నొకింత కలవరపరచింది.

ఆ దృశ్యము చూచిన బాలచంద్రునకు ఒడలుపొంగి అనుచరులతో గూడ పగతుల సేనలమీదికి లంఘించి దుమికాడు. చేతగల మారణాయుధములతో గురజాల సేనల చిందరవందరలు సేయుచు విజృంభించాడు. ఆ వీరవిహారమున కొందరకు ముక్కులు తెగినవి. కొందరకు భుజములూడినవి. కొందరకు చేతులు పోయినవి. కొందరకు డొక్కలు చీలి ప్రేగులు బయటుపడినై. కొందరు కాళ్ళు తెగి పడిపోవుట చూచి మరింత సమరోత్సాహంతో గజబలం మీదికురికిన బాలచంద్రుడు కారడవిని కాల్చివేయు మహాగ్నిజ్వాలవలె యెక్కడికక్కడనే తారసిల్లుచు ఏనుగుల కొన్నింటి మస్తకంబుల చీల్చియు, కొన్నింటి దంతంబు లూడదన్నియు, కొన్నింటి తొండంబుల నరికియు, కొన్నింటి చెవులగోసియు, కొన్నింటి మేనికండల చెండాడియు భీభత్సము చేయుచుండ నేనుగులు సైతము గీపెట్టి దిక్కుదిక్కులను పారజొచ్చినై చేజిక్కిన మావటీల గొంతులు గోయుచు ముందుకుసాగిన బ్రహ్మన్నపుత్రుడు అశ్వదళము నెదిరించి కొన్ని గుర్రముల గొంతులు నరకుచున్నందున నలగాముని పరివారమునందలివారు "వీడు బాలుడుకాడు- మా పాలిటి కాల యము"దని వానివంక కన్నెత్తియేనియు చూడలేకపోయారు.

సంకుల సంగ్రామరంగం కొంతసేపటికి కాలుచేతులు తెగినవారు-కన్నుముక్కులు పోయినవారు, డొక్కలు చీలి-కండలు రాలిపడినవారు, నేల కొరిగియు

ప్రాణములు తల్లడిల్లువారు, చావసిద్ధమై బాధపడుచున్నవార, చచ్చిపడిపోయిన వారు, గొంతెత్తి బిగ్గరగ వాపోవువారు- ఏద్వైనైనా వోపికలేక బాధపడుచున్నవారి ప్రాణాలను కాపాడుకొన పారిపోవుచు పడియున్నవారిని త్రొక్కుకొని పరుగెత్తు వారితో రణభూమియంతయు భయానక దృశ్యము దాల్చింది.

సైన్యములో క్రొత్తగా చేరినవారికి యుద్ధరంగము తెలియనివారున్నారు. వారంతా కడుపు నింపుకొనడానికి కూలికాసించి వచ్చినవారేకాని కత్తిదూసి పోరాడగల గుండెధైర్యం కలవారుకాదు. వారికి యుద్ధములో మెలకువలు తెలియవు ధైర్యసాహసములు మొదటినుండియు నుండవు. అట్టివారివలన ప్రభువుల కపజయమేగాక అపఖ్యాతియు కల్గుట సహజము. అట్టి పిరికివెధవలు బాల చంద్రుని పాటాటోపం చూచి భయపడిపోయారు. "ఊపిరియున్న నుప్పుకల్లుమ్మి కొని బ్రతకవచ్చు" నను నిర్ణయానికి వచ్చారు. బ్రతికి బయటపడేదెలాగాయని దిక్కులు చూచారు. కొందరు ప్రక్కప్రక్కలకు పారిపోయారు. కొందరక్కడక్క డనే నక్కియున్నారు. కొందరు పాదాక్రాంతులై చేతులను జోడించి "ప్రభూ! మాకేమీ తెలియదు. మమ్ములను ప్రాణాలతో విడిచిపెట్టండి. మా కొంపలకుపోతా" మని ప్రాధేయపడ్డారు.

గురజాల సేనలు పల్చబడినై.

నరసింగరాజు పట్టుదల విడనాడక పారిపోవుచున్న వారి నుద్దేశించి "వీరు లారా! మరచి పోకండి. మనమందరం పెండ్లికివచ్చిన పెద్దలముకాము. శత్రువులను

చంపుటో, శత్రువుల చేతులలో చచ్చుటకో వచ్చిన సంగ్రామ యోధులము. నేడు గాకపోయిన యింకొకనాటికైనను మనలను విడిచిపెట్టని మరణమునకై భయపడు టెందులకు? పారిపోయి యేమిచేయుదురు? మేమందరము మీ వంటి మనుషులము కామా?- మాకు ప్రాణములమీద తీపిలేదా! మాకు భార్యబిడ్డలులేరా? మా వలనే తెగించిరండి. మరణమునో, విజయమునో యిచట పొందండి" అని ప్రోత్సహింప తప్పించుకొని పోదెంచిన వీరులంతా తిరిగి వీరత్వమున విజృంభించి మాచర్లసేనల నెదిరించి పోరాడసాగారు.

శత్రుసేనలు చాలవరకు సమసినవి- సమర భారం తగ్గినదనుకున్న బాల చంద్రునకు మళ్ళీ తీరని పనికల్గింది. యుద్ధం భయంకరరూపం దాల్చింది.

# నరసింగరాజు బాలచంద్రుల మరణము

అంతకంతకు రోషమతిశయించుచున్న బాలచంద్రుడు "ఏడి నరసింగుడు ఎక్కడున్నా"డనుచు ముందు కురికి యెదురైన వీరుల దునుమాడుచు గజబలం మీదకు గంతువైచాడు. అడ్డువచ్చిన కేరళదేశాధీశ్వరుని కరవాలమున పొడిచి చంపాడు. కర్ణాటక మండలేశ్వరుని సంహరించాడు. మాళవాధిపతిని మస్తకం తెగ వేశాడు. బర్బరపురీశ్వరుని చేతులు నరికివేశాడు. అటు మీద నరసింగరనాథుని హుటాహుటి నెదిరించి పోరాడాడు. నరసింగరా జెక్కిన మదకరీంద్రము బాలుని మీదికి రాబోయింది. బాలుడు దానిని తప్పించుకొని చివాలున గజము మీదికి

లంఘించి నరసింగుని దాకాడు. వారిరువురి పోరాటము చూచువారికి కర్ణార్జునులో, వృత్రదేవేంద్రులో, రామరావణులో యన్నట్లు వీరరసప్రధానమై కన్పించింది.

ఆ సమయంబున వెంకు అను వీరుడు నరసింగరాజున కంగరక్షకుడుగ వచ్చి యెదిరించాడు. ఆవేశములోనున్న బాలచంద్రుడు తొందరలో వెంకు తల నరికికొని తండ్రియొద్దకు పోయాడు. బ్రహ్మనాయుడు పోల్చిచూచి ఇది నరసింగుని తలకాదని చెప్పినందున బాలుడు మళ్ళీ యుద్ధరంగంలో ప్రవేశించి నరసింగుని మీద తలపడ్డాడు. నరసింగ బాలచంద్రులకు రెండవసారికూడ భయంకర సంగ్రామం జరిగింది. నరసింగుడదనుచూచి బాలుని డొక్కలో కత్తిలో పొడిచాడు. దెబ్బతిన్న బాలచంద్రుడు తోకత్రొక్కిన త్రాచులా వీరావేశమొంది నరసింహుని తల తెగ వేశాడు. తన కడుపునుండి జారిన ప్రేవుల నొకచేత నదిమిపట్టుకొని బాలచంద్రుడు నరసింగరాజ శిరమును రెండవచేత బట్టుకొనివచ్చి శిబిరము నందున్న తండ్రి పాదముల యందుంచి యిక నాపని పూర్తియైనదన్నట్లుగా సమీపమునందే నేలకొరిగి ప్రాణాలను విడిచాడు.

అంతటితో సాయం సమయమయింది- యుద్ధం ముగిసింది.

